REG. No. 757

శ్రీ

# అభినవసరస్వతి

యును నొక మాస[illegible]

అష్టావధాని. జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ

ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 6 — 1914 డిశంబరు. — సంచిక 12

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

# ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరిస్వాములవారు.

ఈనెలసొమ్ముచెల్లించిన చందాదారులు.

1 కలువలపల్లి రంగయ్యశాస్త్రిగారు, భాస్కరపంతులు, యేలూరు.
2 వాడుపునూరు వీరోబగారు, చందంపేట,

---

# గ్రంథస్వీకారము

1 విష్ణుపదశావతారస్తవము, 2 ఉత్తరరామచరితములను గ్రంథములు మాకార్యస్థానమలంకరించినవి. వీనిపై మాయభిప్రాయము ముందుఁదెలుపఁబడును.

# విగ్రహారాధనము

ఇది గీరతములోని తృతీయభాగము. విగ్రహారాధనము కూడ దనువారి దుర్వాదము నడఁచి ముఖ్యమని తేల్చును. జనవరి నెలాఖరులోగా కొనువారికి పోస్టేజితో రు 0-8-0. పిదప పోస్టేజితోసహా వెల రు 0-10-0.

వలయువారు:—

చళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు,
శతావధాని,
బందరు.

అనివ్రాసి తెప్పించుకొనవచ్చును.

# అభినవసరస్వతి.

సంపుటము 6. | జానపాడు ఆనంద సం॥ మార్గశిరమాసము. | సంచిక 12.


# రామేశ్వర శతావధాని సంచారము

చదువరులారా!

ఈయన యెవరో కనిపెట్టితిరా? ప్రకృతపు ఘోరసంగ్రామమునకుం గారణభూతులగు సర్వియా యాష్ట్రియా పాలకులవలెం దిరుపతి వేంకటేశ్వరకవులకును జెల్లంకొండ రామారావుగారికిని జరిగిన పశ్యశబ్దవిషయిక పత్రికావాదమునకుం గారణభూతులగు ముష్ఠాల జానకిరామయ్యగారు, వీరు తత్పశ్యశబ్దవిషయిక వివాదనాటకమారంభింపఁజేసి పరిత్యక్తస్వదేశులై యన్యదేశసంచరణమునకు దొరకొనిరి. సూత్రధారివేషధారణసమయమునకు వీరు మేఘసందేశము కాఁబోలు రామారావుగారివద్దఁ జదువుచుండిరి. అయినను నప్పటికే తిరుపతి వేంకటేశ్వరులకు నడపిన యుత్తరములలో నొకట శర్మశాస్త్రిబిరుదముఁ దగిలించుకొనిరి. అటుతర్వాత కలభాలధనప్రదర్శనపర్యంతము మరల వీరు రంగస్థలమునకు వచ్చినవారు కాక సూత్రధారిలక్షణముల్ సార్థకపఱచిరి. వీరు కొప్పరపువారివలె యశము నార్జించు నుద్దేశమున నాశుకవిత్వమారంభించి తదనుకూలవేషభాషాదులచే దంభసామ్రాజ్యమునకుం బట్టభద్రులై నాగరికతావిశేషము లెఱుంగక రసగ్రహణశక్తిలేక కేవల దేవబ్రాహ్మణభక్తివిశ్వాసములతో వర్తిల్లు నిజాము దేశస్థుల వెఱపించుటకు సాహసించిరి. ఇచ్చట వేదశాస్త్రశ్రోత్రియులు కొంతకలిగియున్నను నాంధ్రభాషాజ్ఞానము బొత్తిగా శూన్యమైయున్నది. ఇట్టియామాయిక దేశముం బ్రవేశించి యీ శతావధానిగారు నడపిన వృత్తమంతయు నాశ్చర్యకరమైయున్నది. తమమాయామానుషవిగ్రహతం గ్రహించిన బుద్ధిమంతులు కొందఱున్నను నాంధ్రభాషాజ్ఞానశూన్యత్వం బగవంచనాపరాఙ్ముఖతను మిన్నకున్న నవధానిగారు పూర్తిగాఁ దద్దేశవాసుల కనులలో, కారముఁజల్లి రాఁగలిగిరి. వీరు ధర్మవరగ్రామమున 18వందిపృచ్ఛకులఁ గూర్చుండఁబెట్టుకొనిచేసిన శతావధానపుఁ బ్రారంభమున

శా॥ శ్రీరాజీవదళాక్షు! భక్తజనసంసేవ్యప్రభావోదయా!
తోరంబైనభవత్కృపామహితు శాంతుం జేసినన్నింపు ని
స్సారానందమహాబ్ధిపుంఫలము చూజక్ ముందుగంగంటి మో
స్మేరాంకూరముఖాబ్జ! మ్రొక్కెదను లక్ష్మీనాథ! రక్షింపవే ॥

అని ధ్యానించిరఁట. ఇందుఁ బ్రభావము గాని ప్రభావోదయము గాని భక్తజనసంసేవ్యములైన ట్లర్థము చెప్పవలె. అప్పుడు నిరూపములగు ప్రభావోదయములకు సేవ్యత్వ మప్రసిద్ధము. లేక ద్వంద్వము చేతనున్న వ్యంగ్యబోధకమును రసహీనమును క్లిష్టాన్వయమును గాన ననర్థము. "తోరంబైనభవత్కృపామహితు" అనచోటఁ

దోరంబైనకృపామహితుఁడని యన్వయింపవలెఁ గాని మహాత్తైనకృపామహితునకుఁ దోరంబు విశేషణము కానేరదు. ఈశోరము కృపకు విశేషణముగాఁ గవి ప్రయోగించెఁ గాని కృపకును నిలుపక సమాసఘటితముచేసినందున నట్లన్వయము కాఁబోదు. ఇఁకఁ గృపామహితుఁడైన యెవరిని యద్విషయమున శాంతుఁజేసినన్నింపవలెనో తెలిసికొనఁ గవియొద్దకేపోవలె. ఇకారాంతమగు సబ్ధిశబ్దమునకుఁ బుగాగమము రానేరదు గాన మహాబ్ధిపుంఘలమనుట యప్రశస్తము. ఇట్టిఘటనమును ముందుగాఁగంటిమని ప్రస్తుతిప్రాశస్త్యము నిరూపింపకయేవదలుట యజ్ఞానవిలసితము.
తరువాత

శా॥ ధర్మాధర్మవిచక్షణత్వమున మోదంబొగ గాసత్యమే
మార్గంబించుకలేక బోచెదవు సంభావింపగాత్తద్దయున్
కర్మశ్రేణులనజ్ఞులందయను శీఘ్రంబొప్పభావించి యీ
ధర్మాగస్థుల బోవరాన్నృహరి! బోధవ్యం బవశ్యంబుగన్!

ఇత్యాదులు చెప్పినఁట. వెఱ్ఱివానిమాటలయందుఁబోలె వీనియందలియాశయము దురవగాహము గావున నేతాదృక్పద్యముల విమర్శించుట నవసరము. కాని పండితశౌండమన్యతా సూచకములగు వారిప్రగల్భముల నొకటిరెంటు వ్రాసివిడిచెద.

సీ॥ తద్దులైనట్టివిద్వాంసకాండంబుచే మ్రొక్కించినావుసమ్ముదముతోడ
మెదకుసీమాదినిర్వదియోజనావని వే జయధ్వజము స్థాపించినావు

నిజము - ఈయనకు మ్రొక్కినది విద్వాంసకాండమే కాని విద్వత్కాండముకాదు. ఆవిద్వాంసకాండ మెక్కడిదనుకొంటిరో వంధ్యాసూనునకుఁ దోడఁబుట్టినది. శతావధానిగారూ! మెదకుసీమ నిర్వదియోజనాల స్థాపించినదికా విూయంబ జయధ్వజము. పెప్పాల నాగసింగి ధర్మకరములలో నేకాదూ? అం దేవిద్వాంసులు విూకు మ్రొక్కినారు? సిద్దిపేటలో క్షమాపణకోరినది మఱచితిరా? విూపాండిత్యమునకే జయధ్వజమెత్తైన విద్వాంసకాండము మ్రొక్కును మెదకుసీమను విద్వాంసులు లేరనుకొనకుఁడు.

సమస్య- వ్యాఘ్రముఁ బుంబోఁడుఁగంటి నేఁటికిదిగో వారాశితీరంబునన్

శా॥ శీఘ్రంబించుకలేదు, నిద్రదంకన్వెచేట్పాటుచేకూర్చు వి
ద్యాఘ్రాణంబును సేయ వెప్పుడును మోదంబారగా లెమ్ము మే
యాఘ్రంబె త్తగబోవగన్ వలయు స్నానాగంబుధ్యాంతేణ క॥ వ్యా॥

ఇట్లు సమస్యాపూరణచేయువారలేనా జయధ్వజమెత్తుట. శ్లో॥ అపశబ్దాన్ ప్రయంజానో రౌరవంనరకం వ్రజేత్" అనున్యాయముం గ్రహించి వీరలింకను విద్యసాధించి కవిత్వమునకు దిగఁటమంచిది.

నంగా రామకృష్ణశాస్త్రి.
మెదక్ తాలూకా, దరిపల్లి.

తే॥ ఇంక నేలబహూక్తి నిశ్శంక భక్త
గణముపూజింప భోగమోక్షములుగలవు
మీరలింతట శివభక్తవారములను
బ్రీతిఁబూజింపుఁ"డని చెప్పె సూతుఁడంత॥ 155

శా॥ ఆమాటల్వినిశౌనకాదులపు డార్యాధీశుసద్భక్తులన్
వేమాఱున్ భజియించి మ్రొక్కులిడఁగా విశ్వేశుడున్ భక్తులన్
బ్రేమం గొల్చుటఁ దాఁ బ్రసన్నుఁడగుచున్ బెంపొందునాట్యంబును
ద్దామప్రౌఢిమఁ జేసె సన్మునులు నేత్రానందమై చూడఁగన్॥ 156

తే॥ అంబికాధీశుఁ డఖలేశుఁ డాత్మమయుఁడు
సేయునృత్యంబుగని మునిశ్రేణులపుడు
పరవశత్వంబునొ... ...రముఁ డాత్మ
ఘనచిదంబరపీఠిఁ గలసిమెలసె॥ 157

— ముక్తిసాధనము —

వ॥ అంత నైమిశీయమునీంద్రులు సూతునకిట్లనిరి. 158

తే॥ "జ్ఞానమునఁ బూజసేసినఁగాని ముక్తి
గలుగ దాముక్తి జ్ఞానైకకారణముగఁ
దోఁచుఁ గారణ మింకొ... దోఁచునేని
తెలియఁజేయుముమాకు సందేహముడిగి॥ 159

వ॥ మఱియుఁ గొందఱు కేవలజ్ఞానంబును దానంబును వ్రతం
బును యజ్ఞంబును దపంబును నాశ్రమచతుష్టయంబును స్వాధ్యాయం
బును మహేశ్వరస్థానంబులగు మహాక్షేత్రంబులు ననేకక్రియాకాండం
బులును దమతమ మతానుకూలంబుగా ముక్తిసాధనంబులని వచింతు
రు, ఇంక సర్వజంతు సులభంబును సద్యోముక్తిదంబును నగు సాధ
నంబు మాకెఱిఁగింపు"మనిన సూతుండిట్లనియె, 160

తే॥ వినుఁడునామాటమునులార! విశ్వసించి
మున్ను నారాయణునకును మ్రొక్కివ్యాసుఁ

డడిగెనీరీతి నద్దేవుఁ డబ్జసూతి
వ్యాసుఁ డమరులు లక్ష్మి త న్నరసికొలువ॥ 161

సీ॥ కైలాసమున కేగి కరకంఠుశివుని భ
వానీశు హరుఁ జతుర్వర్గఫలదు
నీశుల కెల్లనునీశుఁ దేజోమూర్తిఁ
బతుల కెల్లనుమహాపతిని బరముఁ
బరమేశు స్మృతిమాత్రఫలదు దేవాధీశు
సానందు సత్యవిజ్ఞానమయుని
సంపూర్ణు సాక్షిని శంకరుఁ బొడఁగాంచి
ప్రణమిల్లి సద్భక్తి పరవశముగ
నడిగెసరీతి లోకహితార్థముగను
దానివిని సర్వభూతహితంబుసేయు
హరుఁడు సర్వజ్ఞుఁ డిట్లని యానతిచ్చె
మఘువిరోధికి మధుసుధామఘురఫణితి॥ 162

తే॥ "జలజలోచన! వైకుంఠ! సాధుసాధు
పరమమద్భుతమైనట్టి ప్రశ్న మొకటి
యడిగితివినీవు లోకహితార్థముగను
మున్ను జగదంబయడిగెను నన్ను నిట్లు॥ 163

క॥ అదినీకుదెలియఁజెప్పెద। విదితంబగుఁబద్మనాభ! విను, వేదశిఖా ।
భ్యుదితజ్ఞానమె మోక్షా!స్పదమగు సాధనముగాఁగ సమ్మతిఁదలఁతుర్॥

వ॥ అట్టి పరమశివజ్ఞానం బనేకజన్మసంసిద్ధిగలిగి శ్రౌతస్మార్తాను వర్తులగు విగతదోషులకు మత్ప్రసాదానుకూలంబున సిద్ధించు, నిర్వృత ధర్మనిష్ఠుండగు బ్రాహ్మణుండు జ్ఞానాభ్యాసంబునకు ముఖ్యాధికారియగు, అన్యులగు రాజన్యవైశ్యులకుఁ దారతమ్యంబుగా జ్ఞానాభ్యాసాధికారంబుగలుగు, ద్విజస్త్రీలకు వేదసంబంధజ్ఞానాభ్యాసాధికారంబు గలుగు,కొందఱువిద్వాంసులు స్త్రీలకు శూద్రులకు సమానాధికా

రంబువచింతురు,శుశ్రూషావంతులగు శూద్రులకుఁ బురాణంబులవల ననే జ్ఞానాధికారంబుగలుగు, ఇంక సకలవర్ణంబులకు నితరభాషావిశేషంబులఁ దత్తత్కాలంబుల జ్ఞానాధికారంబుగలుగు,వైకుంఠా!యీ జన్మంబునందు సాధనాభ్యాసంబులు లేకయే విజ్ఞానసిద్ధిగలవారలు పూర్వజన్మంబునఁ బెద్దలచేత ననేకవిధంబుల బోధింపఁబడినవారు,అట్టిముఖ్యాధికారులకుఁ బ్రతిబంధరహితంబైన జ్ఞానంబు సిద్ధించు,దాననీజన్మంబునంద ముక్తిగల్గు,ఇట్లు జన్మాంతసంస్కారంబు లేనివారలకీజన్మంబున విజ్ఞానపూర్వపుణ్యావశంబున జనించెనేని సప్రతిబాధకంబై జన్మాంతరంబులఁ బ్రతిబంధక్షయంబై ముక్తినిచ్చు,విశుద్ధాత్మునకు విశుద్ధజ్ఞానంబే జనించు,అట్లుగావున సకలమానవులకు మోక్షంబు బయత్నంబుగా సిద్ధింపదు,అయిన నీజన్మంబునందే యప్రయత్నంబుగా ముక్తిగల్గునుపాయంబు జగద్ధితంబుగా నుపదేశించెద, లోకంబున భుక్తిముక్తిప్రదంబులగు విశిష్టస్థానంబులుగలవు, అందుభక్తిజ్ఞానసహితంబుగా నివాసంబుసేయవలయు,అదెట్లనిన, 165

క॥ వారాణాసి ముక్తిశ్రీ। కారణ మం దొడలువిడువఁగలజీవులకుఁ
దారకమంత్రజ్ఞానం। బారయ నేఁ దెల్పువాఁడ నత్యంతదయన్ ॥ 166

క॥ దక్షిణకైలాసాఖ్యము।ప్రక్షీణాఘంబు,దాఁనిపజ్జ నిలింపా
ధ్యక్షాశ్రయమై యొకనది।వీక్షింపసువర్ణముఖరి వెలయు ముకుందా!

ఉ॥ ఆనదినిర్మలాంబువులయందువసించు సమస్తలోకస
న్మానితతీర్థకోటి,యనుమానము లేదు రమేశ!మాఘమం
దైన మఖర్క్షదర్శల మహావ్యతిపాత్తులయందు దానముం
బూనియొనర్చి నన్ను సురపూజితుఁ దద్గిరినాథు శంకరున్
మానకపూజసేయఁగలమర్త్యుఁడు ముక్తినిగాంచు మాధవా! ॥ 168

క॥ దక్షిణకైలాశేశ్వరు।నక్షీణకృపాఢ్యు నన్ను ననుదినమందున్
వీక్షించిభుజించుచునరుఁ।డక్షీణతనున్న జ్ఞాన మబ్బు ముకుందా! ॥

తే॥ వ్యాఘ్రపురమున శివుఁజూచి యనుదినంబు
వినతులొనరించి భజియించు విమలచరితుఁ
డొక్క వత్సరమరుగఁగా నక్కజముగ
శౌరి! ముక్తి నిగాంచు సందేహమేల॥ 170

సీ॥ వృద్ధాచలమ్మున వెస భక్తియుక్తిచే
వత్సరద్వయము నివాసముగను
వసియించి తన్మహావసథవాసు మహేశు
సప్రదక్షిణముగాఁ జూఁగి మ్రొక్కు
నేని వానికి ముక్తి నిత్యమై సిద్ధించు
నప్రయత్నంబుగా ననఘులార!
ధర విశిష్టస్థాననిరతుఁడౌ వానికి
బంధకృత్సంసారభయము లేదు
గావునను జన్మసంసారకలుషహారణ
కరణపరిణత నైర్మల్యసరణి యైన
యొక విశుద్ధమహాస్థలి నుండవలయు
మోక్షమందఁ దమపేక్షించు విచక్షణుండు"॥ 171

తే॥ అను మహాదేవువాక్యంబు లాలకించి
హరియు నజుఁ దేవతల లక్ష్మి వ్యాఘ్రపదా నిఁ
గూడి పరమేశునకు మ్రొక్కి వేడుకలర
విధిని సురలను వ్యాసుని విడిచి యంత॥ 172

క॥ తానొక్కఁడె సురమునిస। న్మానితము చుబంచ యోజనాయామంబు౯
మానక యోజనవిస్తృత। మైనమహా కాళహస్తి కరిగె౯ భక్తి౯॥

తే॥ అజుఁడు వాణియు శక్రుండు నమరవరులు
గజము నాగంబు నసురులు ఖంచరమునులు
పూజచేసిరి సద్భక్తి భుక్తిముక్తి
దాయియగు యామ్యకైలాసధరమునందు॥ 174

తే॥ అందె విష్ణుండు లక్ష్మితో నభవుఁగొలిచె
నజుఁడు వాణితోఁ జేరె వృద్ధాచలంబు
వ్యాసుఁడరిగెను శ్రీ వారణాశిపురికి
వ్యాఘ్రపురిఁ జేరి రమరులు బ్రాహ్మణులును॥ 175

ఉ॥ కొందరుమౌనిపుంగవు లకుంఠిత పూర్వతపోబలంబునన్
జెందిరి భుక్తిముక్తులకుఁ జేరికమై శివనాట్యవిక్రియా
స్పందదమైన వ్యాఘ్రపురి వ్యాసవచస్థితి శ్రద్ధగల్గినే
నొందితిఁ గాళహస్తి యటనుండితి వత్సరమాత్రమెంతయున్॥ 176

తే॥ అటుల వృద్ధాచలంబున నధివసించి
పుండరీకపురంబునఁ బొసఁగనిలిచి
కాశికరిగి విజ్ఞానవారాశినగుచు
ముక్తిగాంచితి నో మునిముఖ్యులార!॥ 177

క॥ మీరలు శ్రద్ధాయుక్తిని। వారకయిట్టిట్టియెడల వర్తింపఁదగున్
గోరికమైమును మునులిటు। లారసివర్తించి బంధ మడఁచిరికాదే"॥

— కాలపరిణామ తదనవచ్ఛిన్న స్వరూపకథనము —

వ॥ అనిన రోమహర్షణికి మహర్షులిట్లనిరి. 179

తే॥ "కాలవేదులచేత నికాలసంఖ్య
యెట్లు చెప్పంగఁబడునో తానిట్లు కాల
వశమునొందనివాఁడు నెవ్వండుగలఁడొ
తెలియఁగాఁ జెప్పుమా సూత! ధీసమేత"?॥ 180

వ॥ అనిన సూతుండిట్లనియె. 181

సీ॥ "కాలసంఖ్యవచింపఁగా నా కశక్యంబు
జన్మకోటులకైన సంయములకు
దివిజులకును దేవదేవేశుఁడైనట్టి
యంబికాపతికైన నలవియగునె

యైన సంగ్రహముగా నదిమీకుఁ గరుణఁజేఁ
దెల్పెదవినుఁడు సందేహముడిగి
తనరంగ నిమిత్తాష్టదశకంబు కాష్ఠయౌ
నది ముప్పదైనఁ దా నగుఁ గళాఖ్య
యదియు ముప్పదియైనఁ దా నగు ముహూర్త
మదియుఁ బన్నెండు పగలును యామినియును
బదియునైదహర్నిశములు పక్షమగును
బక్షములురెండు మాసమౌఁ బ్రాజ్ఞులార!॥ 182

వ॥ మఱియు నమ్మాసంబులు పదియురెండైన వత్సరంబగు, అందు షణ్మాసంబుల కయనసంజ్ఞికంబరగిన దక్షిణోత్తరాయణంబులు దేవతలకు రాత్రియుం బగలగు, మనుష్యులకుంబలెఁ బక్షమాసాయనాబ్దంబులు క్రమంబుగా దేవతలకుం బ్రివర్తింపుచుండు, దేవమానంబున ద్వాదశవర్షసహస్రంబైన జతుర్యుగంబులగు, అందుఁ గృతయుగంబు నాలుగువేలును దా. సంధ్యాసంధ్యాంశం బెనమన్నూఱును త్రేతాయుగంబు మూఁడువేలును సంధ్యాసంధ్యాంశం బాఱునూఱులును ద్వాపరంబు రెండు వేలును సంధ్యాసంధ్యాంశంబు నన్నూఱును గలియుగంబు వేయు సంధ్యాసంధ్యాంశం బిన్నూఱునుగూడ ద్వాదశ సహస్రవర్షంబులు యుగచతుష్టయంబగు, ఏకసప్తతి దివ్యయుగంబులు మన్వంతరంబగు,అట్టిమన్వంతరంబులు పదునాల్గు బ్రహ్మకు దినకల్పంబగు,అంతియెప్రమాణంబు రాత్రియగు, అట్టిదివారాత్రంబులు మున్నూటఱువదియైన నొక్క వర్షంబు,అట్టివర్షశతంబు పరాంతంబగు,అంత బ్రహ్మ యంతంబునొందు,అప్పుడీవిశ్వంబు మాయం బ్రవేశించు,ఇంకవిష్ణుండును రుద్రుండును నీక్రమంబున స్వమానాగత స్వప్రళయంబుల విలయంబునొంది ప్రకృతిఁగలియుదురు, ఇట్లు బ్రహ్మవిష్ణురుద్రశరీరంబు లనేకంబు లనేకకల్పంబుల స్వస్వకారణంబుల

విలయంబునొందుచుండు, మాయయుఁ బ్రళయకాలంబున సర్వబోధ సదానందుండును బ్రహ్మరుద్రాదిసంజ్ఞికుండును బరబ్రహ్మంబును నగు నాపరమేశ్వరునందు నభేదస్థితివహించు, అచ్ఛేటికారణం బత్యంతదుర్గమంబగు, తెలివిలేకుండుట మాయయును నాత్మతత్త్వతిరస్కారకరణంబునఁ దమంబును విద్యాన్యత్వంబున నవిద్యయు నజ్ఞానకారణత్వంబున మోహంబును నద్వైతలక్షణ్యాద్వృష్టిచే మనంబును గార్యనిష్పత్తిహేతుత్వంబునఁ గారణంబును గార్యంబునుంబోలె వ్యక్తంబుగాకుండుట నవ్యక్తంబును నగు నమ్మహేశ్వరసంబంధినియగు పరాశక్తికిఁ బరాత్మునకున్నట్లు స్వాతంత్ర్యంబు లేదు, ఇట్టిపరాశక్తిచేత దేవదేవుండును బరమాత్ముండును నగు శివునకే కాలంబుదయించె, సర్వజంతువు లేతత్కాలవశంగతులగుదురు, ఇక్కాలంబున సర్వజంతుజాతంబు లీనంబగు, కాలం బెందును లీనంబుగాదు, కాలంబును మాయయును దత్కార్యంబును శివునిచేత నావృతంబై యుండు, శివుండు కాలావచ్ఛిన్నుండగు, సత్యంబు మాయతోడంగూడి శివునియంద లీనంబగు, సత్యస్వభావుండగుట శివుండు విలయంబునొందఁడు, భూతభవిష్యద్వర్తమానవస్తుసంతానంబున కవచ్ఛిన్నుండగు శివుండు కారణంబై యుండు, "ఇమ్మహాదేవ ప్రసాదంబునఁ గల్పితంబై బ్రహ్మవిష్ణ్వాదికంబైన జగంబు తదధీనంబై యుండు" నని శాశ్వతమైన శ్రుతి పల్కు — అసంఖ్యులగు బ్రహ్మవిష్ణురుద్రేంద్రాద్యమరులు విలయంబునొందుదురు. శివుండొక్కండే బ్రహ్మవిష్ణురుద్రాత్మకుండై సృష్టిస్థిత్యంత కల్పనలచేవిజృంభించుచుండు, రజోగుణచ్ఛన్నుఁడై తద్గుణంబవలంబించి విధి జగత్సృష్టివిధయొనర్చు, తమోగుణచ్ఛన్నుండై సత్వగుణంబవలంబించి విష్ణుండు జగద్రక్షణుండగు, సత్వగుణచ్ఛన్నుండై తమోగుణంబవలంబించి రుద్రుండు జగత్సంహారణాత్ముఁడుండగు, బ్రహ్మవిష్ణురుద్రులకు గుణభేదంబువలనఁ బ్రత్యేకంబును గొన్ని రజోగుణోద్రేకంబులును గొన్ని సత్వగుణో

ప్రదేశంబులును గొన్ని తమోగుణప్రదేశంబులును నగు మూర్తులనం
తంబులు పరస్పరోపజీవ్యంబులై ప్రకాశింపుచుండు, సర్వమూర్తులందు
సత్త్వాదిలక్షణుండగుశివుండు ప్రత్యగాత్మభావంబున వసించు, అద్దేవు
నహంప్రత్యయవ్యాజంబున సర్వజంతువు లెఱుంగుదురు,కాని మాయా
వశంబున శివరూపంబుగా నెఱుంగలేరు. శివప్రసాదంబుగలిగిన వేదో
దితమైన యాత్మవిద్యచే బహుజన్మాంతంబునఁ దజ్జ్ఞులా శివస్వరూ
పంబు నెఱుంగుదురు. ప్రసాదహీనులైనఁ బాపిష్ఠులై మాయామోహి
తులై జన్మనాశపీడితులై జనంబులా పరమేశ్వరు నెఱుంగలేరు. ఈ
మూర్తిత్రయంబునం దేయేమూర్తి నాశ్రయించి బ్రహ్మభావననారా
ధింతురు. వారల దఱు తన్మూర్తిద్వారంబుగాఁ గ్రమంబున శివు నెఱుం
గుదురు. అందు రుద్రమూర్తి నారాధించినఁ దత్ప్రసాదంబునఁ గ్రమ
వర్జితులై సర్వగతుండగుశివు నయత్నంబుగా నెఱుంగుదురు. నిర్మలా
దర్శంబున ముఖంబునుంబోలె సర్వరుద్రమూర్తులయందు శివుం డత్యం
తంబుగాఁ బ్రకాశించు.ఇతరమూర్తులయందుఁ దారతమ్యంబుగాఁ బ్రకా
శింపుచుండు. కొన్ని కొన్ని శ్రుతివాక్యంబులు బ్రహ్మవిష్ణురుద్రసూర్యా
గ్నిమూర్తులఁ బ్రత్యేకంబుగాఁ బరిపాలింపుచుండు. మఱియును 1౮౩

తే॥ పదిపురాణంబు లీశ్వరుఁ బ్రస్తుతించు
నాల్గు హరినుతించును, రెండు నలినభవునిఁ
బల్కు నొక్కటి పావకు,పద్మమిత్రు
నొకటి చెప్పుఁ బురాణంబు లకలుషముగ॥ 184

వ॥ ఇట్లుసర్వమూర్తిస్థితుండయ్యు మూర్తిద్వారంబుగాఁ బ్రతి
పాద్యుండై సత్త్వాదిలక్షణుండై బ్రహ్మవిష్ణుమహేశ్వరోపాస్యుండైన
శివుండు సాక్షాన్మోచకుండనంబరఁగు. అర్థుల కర్థంబును నాత్మవిదుల
కాత్మయు నగు నిమ్మహేశ్వరునంద మాయావశంబునఁ బ్రతికల్పంబును
జగంబు సృష్టిస్థితిలయంబులొందుచుండు. సర్వాంతర్యామియగు నిమ్మ
హేశ్వరునందు యథాపూర్వకంబుగా బ్రహ్మవిష్ణ్వాదులుజనియించి

విలయంబు నొందుదురు. అట్టిపరమేశ్వరుఁ డంబికాసహితుండును నీల
కంఠుండును త్రిలోచనుండును చంద్రార్ధశేఖరుండును నై వ్యాఘ్రపుర
వారాణసి వృద్ధాచల సోమనాథ వేదారణ్య శ్రీగిరి కేదార శ్రీ దక్షిణ
కైలాసాది మహాస్థానంబుల ముక్తికాంక్షులైన భక్తులచే సురగణంబు
లచే నుపాస్యుండై నిత్యసన్నిహితుండై యుండు. "ఇట్టిశివుండుదక్క
సంసారమగ్నుల కుపాస్యుండగు మోచకుండు వేఱొక్కఁడు లేఁ"డని
శాశ్వతయగు శ్రుతి వల్కుఁగావున మీరును గాలపాశవినాశంబునకై
శంకరుండును శశిశేఖరుండును నగు పరమేశుండే యుపాస్యుండును
శ్రోతవ్యుండును మంతవ్యుండును"నని సూతుండు బోధించిన నైమిశా
రణ్యవాసులు శివుండే కాలానవచ్ఛిన్నుండని యెఱింగి నిజహృదయ
కమలకర్ణికాంతరంబునఁ బూజింపుచుండి రంతయు. 185

హరి వరాహరూపంబున భూమినుద్ధరించుట

తే॥ సూతుఁబూజించి నైమిశఖ్యాతమునులు
"మున్ను జలరాశిలోపల మునిఁగినట్టి
పుడమి నేలీలఁ బైకెత్తెఁ బుండరీక
నయనుఁ డిది చెప్పు"మనరి సానందులగుచు॥ 186

వ॥ అనిన సూతుండిట్లనియె॥ 187

సీ॥ "విలయంబునందు నీవిశ్వంబు జలరాశిఁ
గలయ నేకార్ణవజలములందు
సాహస్రపాదశీర్షాక్షుఁడౌ విష్ణుండు
శయనించి జలములే స్థానమగుట
నారాయణుండను పేరుగాంచి మహేశు
శివుఁ బరబ్రహ్మంబుఁ జిన్మయాత్ముఁ
గారణుఁ గృష్ణపింగళు సూర్యరేతస్కు
సత్యు విరూపాక్షుఁ జంద్రమౌళి

ధ్యాన మొనరించి యద్దేవు డూని తాజ్ఞ
ధరణిఁ బైకెత్తె వారాహతనువుఁ దాల్చి
లలితదంష్ట్రాగ్రమున రసాతలముఁ జొచ్చెఁ
దనమహాబలస్ఫూర్తి చిత్రంబుగాఁగ॥ 188

కం॥ యజ్ఞవరాహుని విష్ణుని।దజ్ఞుని బ్రహ్మర్షిసిద్ధతతులు మహాహ్లాద్య
త్ప్రజ్ఞ జనుల్లోకస్థులు।విజ్ఞానదుఁ బొగడిరపుడు వివిధస్తుతులన్॥ 189

వ॥ "దేవదేవ! ఆదిభూత! పురాణపురుష! పరమాత్మరూప! జరామరణామయవిహీనా! పరాత్పర! బ్రాహ్మణపతీ! జగత్పతీ! లోకరూప! శంఖచక్రగదాపద్మపాణీ! విష్ణురూప! విరాడాదిరూప! శ్రీభూపతీ! విశ్వాదిరూప! జాగ్రదాదిరూప! అవస్థాసాక్షీ! అవస్థారహిత! తురీయ! తురీయాతీత! విశుద్ధ! ఓంకారరూప! శివ! శివప్రద! విజ్ఞాననిధీ! జగద్యోని! నిత్యముక్త! వాఙ్మనోదూర! ఆకాశాదిప్రపంచరూప! శంకర! మాయారూప! సత్తామాత్ర! జనార్దన! భాసైకసాక్షీ! వాసుదేవ! ఆదివ్యూహాత్మకా! దశావతార! యోగమూర్తి! కర్మస్వరూప! జ్ఞానరూప! గుణత్రయాత్మక! సగుణనిర్గుణరూప! అద్భుతసురేశ్వర! శివప్రాప్త్యైకహేతుక! సోమార్కానలనేత్రరూప! యజ్ఞధర! పద్మనాభా! శార్ఙ్గపాణీ! సంసారతాపహారణ! శ్రౌతస్మార్తజనశీఘ్రముక్తిద! అన్యజనసంసారప్రద! అవ్యయ! అసురహారి! క్షీరోదశాయి! వైకుంఠదాయి! రాగాభిభూతజనవైరాగ్యదాయక!" అని యనేక నామంబుల బ్రహ్మర్షిసిద్ధసంఘంబులు స్తోత్రంబులు చేసిన వారలకుం బ్రసన్నుండై భూమి యథాపూర్వంబుగా నునిచి వారాహమూర్తి యగు విష్ణుండు తద్రూపంబు విడిచి తా బ్రహ్మస్వరూపుండయ్యె, ఆ బ్రహ్మయు, శివాజ్ఞ బూర్వసృష్టి చేయుచుండె" నని సూతుండు చెప్పిన నైమిశీయులమ్మహాత్ము ననేకవిధంబులం బూజించి యిట్లనిరి॥ 190

## —బ్రహ్మసృష్టి కథనము.—

ఉ॥ "స్థావరజంగమాత్మకము సర్వజగంబు విధాత సృష్టి దా
నే విధిఁ జేసెనో" యన యమీంద్రులకిట్లనియెన్ సూతుఁ "డి
చ్ఛావశుఁడైన ధాతకును శంకరునాజ్ఞఁ దనంత సృష్టిక
ల్పావళులందు మున్నయినయట్టుల నయ్యె విచిత్రవైఖరిన్॥ 191

తే॥ తగ మహాదేవునాజ్ఞచేఁ దమము మోహ
మును మహామోహ తామిస్రములు మహాంధ
కార మను పంచసృష్టి యాకమలగర్భు
వలనఁ గలిగెఁ దమోమాయాకలితమగుచు॥ 192

తే॥ మఱియుఁ బశు దేవ రాజస మానవంబు
లనఁగ భూతాదిసృష్టిచే నైదువిధము
లగుచుఁ జెలువొందెఁ బరమేశ్వరాజ్ఞచేతఁ
గమలసంభవు సంకల్పకలనవలన॥ 193

వ॥ ఇదియు, ప్రథమసర్గంబగు, మఱియు మహత్తును దన్మాత్రలును ద్వితీయసర్గంబగు షోడశవికారంబులు తృతీయసర్గంబనంబడు. ఈమూడును ప్రాకృతసృష్టియనంబడియె. నాలవదగు స్థావరసృష్టి ముఖ్యయనంబడు. పంచమంబగు పశ్వాదిసృష్టి తిర్యక్స్రోతంబనంబడు, ఆఱవది దేవసర్గంబగు, సప్తమం బర్వాక్సృష్టియగు, అష్టమంబు భూతప్రేతాదిసంజ్ఞితంబు నవమంబు కౌమారసృష్టియగు, ఇట్లు ప్రాకృతవైకృతభేదంబులఁ దొమ్మిదివిధంబులయ్యె, వీనియవాంతరంబులు చెప్పనశక్యంబులు, సృష్టిముందఱఁ బ్రజాపతి యాత్మసమానుల సనకాదులఁ బుట్టించె,వారలు శివధ్యానైకతత్పరులై సృష్టివాంఛారహితులైరి, బ్రహ్మయు శివమాయామోహితుండై సృష్టితత్పరుఁడైన విష్ణుం డవ్విరించి ననేకవిధంబుల బోధించిన నవ్విధియు మధువిరోధిం గూర్చి కోపంబు సేసి యం దేమియుఁ బాడకట్టకున్న నశ్రుపూర్ణాకులేక్షణుండైన విధా

తను శివుండు దయాళుండై బుద్ధిఁబొసంగె, అంతఁ బరమేశ్వరుఁగూర్చి తపంబు జేసె, అవ్విధికి భ్రూఘ్రాణమధ్యంబున నది ముక్తాభిధంబగు స్వకీయదేశంబునందుండి త్రిమూర్త్యంతర్గతుండైన శివుం డర్ధనారీశ్వరాకృతిం బ్రసన్నుండైన నాశంకరుఁ దేజోరాశి నుమాపతి సర్వజ్ఞు సర్వకారణు నీలలోహితు ననేకవిధంబుల స్తోత్రంబులు సేసి "దేవా! నీవే సర్గం బొనర్పు" మనిన నద్దేవుం డాత్మసమానుల నింద్రులం బుట్టించె. అవ్విధిం చియు "జరామృత్యువశులయి నప్రజలఁబుట్టింపు" మనిన "నేను దుఃఖాబ్ధిమగ్నులగుజీవుల గురుమూర్తిస్వరూపుండనై జ్ఞానోపదేశంబున నుద్ధరించెద, నీవే దుఃఖాఢ్యులగుప్రజలఁబుట్టింపు" మనిచెప్పి యాభగవంతుం డంతర్హితుండయ్యె, అంత విరించి పరమకల్యాణులగు రుద్రుల నివారించి తానె సృష్టికార్యోన్ముఖుండై శబ్దాది మాత్రాస్వరూపంబులగు భూతంబులఁ బంచీకృతంబులుగాఁజేసి సూక్ష్మస్థూలంబులుగావిభజించి వానివలనఁ బర్వతనదీసముద్రవృక్షాదులను గలాదియుగపర్యంతంబగుకాలంబును సకలంబునుం బుట్టించి మఱియు సృష్టిసాధనంబుగా నేత్రంబుల మరీచిని హృదయంబున భృగువును శిరంబున నంగిరసు నుదానంబునఁ బులస్త్యుని వ్యానంబునఁ బులహుని నపానంబునఁ గ్రతువును బ్రాణంబున దక్షుని శ్రోత్రంబునం దత్రిని సమానంబున వసిష్ఠుని సంకల్పంబున ధర్ముని సృష్టిసాధనంబుగాఁబుట్టించి వీరలంగూడి మానవదేహంబుధరియించి యంత నజుండు తనజఘనంబున నసురులఁబుట్టించి యాదేహంబు విడిచిన నది మనుష్యులకు రాత్రిరూపంబయ్యె, మఱియు విధాత నిజముఖంబున దేవతల సత్వగుణవిజృంభితులఁ బుట్టించి యాదేహంబువిడిచిన నదియు మానవునకు శుభప్రదంబైన దినంబయ్యె, మఱియు భగవంతుండైనయజుండు శివాజ్ఞావశంబున సత్వసంయుక్తంబైన శరీరంబంగీకరించి పితరులంబుట్టించి యాదేహంబువిడిచిన నదియు సంధ్యారూపంబయ్యె, రజోరూపంబగు బ్రహ్మవిగ్రహంబువలన మానవులు జనించిరి, తద్యుక్తంబైనతద్దేహంబు జ్యోత్స్నారూపంబయ్యె, అంత రజోరూపం

బైనదేహాంతరంబున క్షుత్పిపాసాభిభూతులగు రాక్షసులఁ బన్నగుల బలాన్వితులగుభూతగంధర్వాదులం బుట్టించి దేహాంతరగతుండై గర్ధభాశ్వమాతంగాదులం బక్షివితానంబులం బుట్టించి యుద్గాత్రంబును ఋతంబును త్రివృత్స్తోమరథంతరంబులను నగ్నిష్టోమాదిసకలంబును సాంగంబుగానిర్మించి వేదశబ్దంబువలన వీనికి నామంబులునిర్ణయించె, ఇట్టి సృష్టికారణంబుమున్ను విరించిచేఁ బంచీకృతంబైన భూతపంచకం బని బ్రహ్మవాదులువచింతురు,ఇట్లుశివాజ్ఞావశంబున స్వప్నసమంబగు విశ్వంబునిర్మించి విధి యప్పుడ తమోరూపంబుప్రవేశించె"నని చెప్పి నైమిశీయమునిమునివ్రాతంబున కిట్లనియె॥ 194

—• హిరణ్యగర్భాదివిశేషసృష్టి •—

తే॥ సకలసృష్టియుఁగావించి జలజభవుఁడు
మూఢసంహారహేతు తమోగుణంబు
విడిచి సృష్టివివృద్ధికై వెస హిరణ్య
గర్భరూపంబుధరియించెఁ గౌతుకమున॥ 195

వ॥ అట్టిహిరణ్యగర్భరూపం బెట్టిదనినఁ దన్మాత్రారూపంబైన భూతపంచకంబుజనించిన నందు సత్వగుణంబున సమష్టిరూపంబై జ్ఞానశక్తిపంచకం బుదయించె,ఆభూతపంచకరజోగుణంబున సమష్టిక్రియాశక్తిపంచకం బుదయించె, జ్ఞానశక్తిసమష్టిభూతాంతఃకరణస్థితుండై త్రిమూర్తులలోన బ్రహ్మ హిరణ్యగర్భుండయ్యె నని సూక్ష్మదృక్కులు వచింతురు,అట్లె క్రియాశక్తిసమష్టిభూతప్రాణాధిష్ఠితుండై త్రిమూర్తులలోన భగవంతుండగువిష్ణుండు సూత్రాత్మకుండనంబడు, తదుభయస్థితుండై త్రిమూర్తులలోన రుద్రుం డంతర్యామియనంబడు,ఇది వేదనిశ్చయంబు, మొదల హిరణ్యగర్భరూపంబునొందెనని చెప్పంబడినబ్రహ్మ మాయచేతఁ దన దేహంబు స్త్రీపురుష భేదంబుగా రెండువిధంబులు చేసె, అందు స్త్రీమూర్తియందు విరా ట్స్వరాట్సమ్రాట్టులఁ

బుట్టించె, వారుమువ్వురు బ్రహ్మాండావృతులైరి, అందు విరాట్టు బ్రహ్మాండాభిమానియయ్యె, ఆవిరాట్టువలన స్వాయంభువుండను యోగినియగు శతరూపయును జనించిరి, వారివలనఁ బ్రజాసర్గంబువిస్తరిల్లె, ఇట్లు ప్రాణికర్మానుసారంబుగా శివాజ్ఞావశంబున బహుసర్గంబులగుచుండు మఱియును, 196

క॥ ధరఁ గొందఱు తనయంతనె పెరుఁగుచునుదత్సృష్టియంచుఁ బలికిరిజడులై
మఱికొందఱు నిజకర్మ। స్ఫురణంబునఁగల్గుననిరి పొసఁగనిపలుకుల్॥

చ॥ మును హిమవంతమందు మునిముఖ్యులు వ్యాసపురస్సరంబుగా
మనమున శంకదోఁచిన సమగ్రతపంబొనరింప రుద్రుఁ డ
య్యనఘుఁడు చంద్రమౌళి పరమాత్ముఁడు నీలగళుండు వేడ్కని
ట్లను గరుణారసస్ఫుటమహామధురాంచితవాక్యవైఖరిన్ 198

సీ॥ "మునివర్యులార మీమనముగలసందేహ
మెఱిఁగితిఁ జెప్పెద నెఱుకపడఁగఁ
గర్మంబునకు శక్తి గల్గదు విశ్వంబు
సృజియింప, నేనును జేయ నొకఁడఁ
బ్రాణికర్మంబు లేర్పడి సహాయములుగాఁగ
వెసనృజింపుచునుందు విశ్వమెపుడు
వేదార్థనిశ్చయవిధియిది సత్యంబు
మదినమ్ముఁ"డని చెప్పి మలహరుండు
అటనదృశ్యంబునొందిన నఖిలమునులు
సంతసమునొంది నిజనివాసంబులకును
జనిరి, మీరును నెమ్మదిసర్వకాల
మిదియునమ్మిభజింపుఁ డయ్యాశునభవు॥" 199

క॥ అనికరుణఁబల్కు సూతుని। మునివర్యులుపూజఁజేసి ముదమలరారన్
వినయభయభక్తియుక్తిని। వినుతించిరి వ్యాసశిష్యు విద్యానిలయున్।

• జాతినిర్ణయము •

తే॥ ఇట్లువినుతించి మౌనీంద్రు లెలమితోడ
నప్రమాలోచనను జాతి నిర్ణయము మాకుఁ
దెలుపు"మనసూతుఁ డిట్లని తెలుపఁదొడఁగె
సకలజగదుపకారంబు సంఘటిలఁగ॥ 201

సీ॥ కరకంఠుఁ డిదిమున్ను ఘటజన్మునకుఁ దెల్పె
ప్రళయకాలంబునఁ బద్మనయనుఁ
డంభోధిశయనించి యభవుఁ జింతింపఁగాఁ
దన్నాభిపంకజధామమునను
హైరణ్యగర్భాఖ్యుఁ డజుఁడు జన్మించిన
భూతేశునాజ్ఞచేఁ బూర్వవాస
నావృత్తిఁ దద్వదనభుజోరుపదముల
బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రు
లంగనలతోడ జనియించి రందు నుత్త
ములకు నధమాంగనలయందుఁ బుట్టినట్టి
వార లనులోమజాతులు వీరికంటె
వ్యత్యయము ప్రతిలోమమోయనఘులార! 202

వ॥ మఱియు నిం దనులోము లంతరాళికులును బ్రతిలోములు వ్రాత్యులును ననంబడుదురు. సధవయగు బ్రాహ్మణియందు బ్రాహ్మణునకుఁ జౌర్యంబున జనించినవాఁడు కుండుఁ డనంబడు, విధవయగు బ్రాహ్మణికి బ్రాహ్మణువలనం బుట్టినవాఁడు గోళకుఁ డనంబడు, బ్రాహ్మణునకు రాజాంగనయందుఁ బుట్టినవాఁడు సవర్ణుండగు, చౌర్యంబునఁ బుట్టినవాఁడు క్షత్రజీవికుండగు, బ్రాహ్మణునకు వైశ్యయందు జనియించిన నంబష్ఠుండు, చౌర్యంబున జనియించినఁ గుంభకారుండు, వాఁడే నాపితుండని యనంబడు, శూద్రియందు విప్రునకు జన్మించినఁ బారశవుండగు,

చౌర్యంబున నిషాదుండగు, దౌష్యంతికి బ్రాహ్మణునివలనజనించిన వాఁడు నాపితుండగు, ఆయోగవియందు విప్రునకుజనించినవాఁడు పింగళుండగు, బ్రాహ్మణికి రాజువలనజనించిన సూతుండగు, చౌర్యంబునరథకారుండగు, క్షత్రియస్త్రీలయందు క్షత్రియునకుఁ జౌర్యంబునజనించినవాఁడు భోజుండగు, క్షత్రియునకు వైశ్యయందుజనించినవాఁడు మాహిష్యాంబష్ఠసంజ్ఞలుగలవాఁడగు, దానియందే చౌర్యంబునజనించిన నచిరసంజ్ఞుండగు, శూద్రియందు క్షత్రియునకు జన్మించినవాఁడు దౌష్యంత్యుఁడనంబడు, దానియందే చౌర్యంబునజనించినవాఁడు శాలీనుండనంబడు, బ్రాహ్మణియందు వైశ్యునకుజనించినవాఁడు క్షత్తయనంబడు, దీనియందే చౌర్యంబునజనించినవాఁడు మ్లేచ్ఛుండగు రాజాంగనయందు వైశ్యునకుజనించినవాఁడు శాలికమాగధసంజ్ఞలుగలవాఁడగు, దానియందే చౌర్యంబునజనించినఁ బుళిందుండనంబడు, వైశ్యయందు వైశ్యునకుఁ జౌర్యంబున జనించినవాఁడు మణికారకుండనంబడు, శూద్రియందు వైశ్యునకుజనించినవాఁ డుగ్రుండనంబడు, దీనియందే చౌర్యంబునజనించిన నటకారుండగు, శూద్రునకు విప్రాంగనయందుజనించినవాఁడు చండాలుండగు, దానియందే చౌర్యంబునజనించిన బాహ్యదాసుండనంబడు, శూద్రునకు రాజాంగనయందుజనించిన వైదేహపుల్కసనామంబులుగలవాఁడగు, దీనియంద చౌర్యంబునజనించినవాఁడు వేలవాఖ్యుండగు, శూద్రునికి వైశ్యయందు జనించినవాఁడు పత్తనశాలికనామధేయంబుగలవాఁడగు, దీనియందే చౌర్యంబున జనించినవాఁడు చక్రియనంబడు, శూద్రియందు శూద్రునకుఁ జౌర్యంబునజన్మించినవాఁడు మాణవికుండగు, సవర్ణన కంబష్ఠయందుజనించినవాఁ డాగ్నేయసత్రకనామంబులుగలవాఁడగు, కరణియందు మాహిష్యునికిజనించినవాఁడు తక్షయు రథకారుండును శిల్పియును వర్ధకియును లోహకారకుండును గర్మకారుండు ననంబడు, విప్రాంగనయం దుగ్రునికిజనించినవాఁడు తక్షవృత్తియగు, వైశ్యయం

దుగ్రునకుజన్మించినవాఁడు సముద్రుండగు, బ్రాహ్మణియందు నిషాదునకుజన్మింగునవాఁడు నాపితుండగు, నృపాంగనయందు నిషాదువలన జనించినవాఁడు నాపితుండెయగు, విప్రాంగనయందు నాపితువలనజనించినవాఁడు వేణుకుండనంబడు, వేణుకునికి రాజాంగనయందు జనించినవాఁడు కర్మకారకుండనంబడు, బ్రాహ్మణియందు దౌష్యంతునకు జనించినవాఁడు భాగలబ్ధుఁడనంబడు, వైశ్యయందు నిషాదునకుజనించినవాఁడు సునిషాదుండనంబడు, బ్రాహ్మణియందు వైదేహునకు జనించినవాఁడు రజకుండగు, బ్రాహ్మణియందుఁ జండాలునకుజనించినవాఁడు శ్వపచుండగు, ఆ శ్వపచునివలన విప్రాంగనయందుజనించినవాఁడు గుహకుండనంబడు, వైశ్యాంగనకుఁ జండాలునివలన జన్మించినవాఁడుదంతకవేలకసంజ్ఞలుగలవాఁడగు, వీనివలన శూద్రాంగనయందు జనించినవాఁడా శ్రమకుండనంబడు, ప్రతిలోమనిషాదులకు శూద్రియందు భైరవులుదయించిరి, మాగధువలన శూద్రియందుజనించినవాఁడు కుకుందుండనంబడు, నృపాంగనయందు మాగధునివలనజనించినవాఁడు ఖనకుండనంబడు, ఆ ఖనకునివలన రాజకన్యకయందు మద్బంధుఁడుదయించె, ఆయోగవునకు రాజకన్యకయందుఁ జర్మకారుండుపుట్టె. విప్రవ్రాత్యునకు విప్రాంగనయందు వందికుండుపుట్టె, క్షత్రవ్రాత్యునకు క్షత్రాంగనయందు మల్లకుండుపుట్టె, మల్లునివలనఁ బిచ్ఛలుండును వానివలన నటుండు నుదయించిరి. నటునికిఁ గరణుండును గరణునివలనఁ గర్మసంజ్ఞుండును వానివలన నృపాంగనయందు ద్రమిళుండును వైశ్యవ్రాత్యునికి వైశ్యయందు సుధన్వుండును బుట్టిరి, వాని కవార్యుండును వానికిభారుషుండును వానికి ద్విజన్ముండును వానికి మైత్రుండును వానికి సాత్వతుండును వానికి మాతంగుండును వానివలన సూతుండును వానివలన దస్యుండును వానివలన మాలాకారుండును బ్రతిలోమనిషాదునివలనఁ గైవర్తుండును మాలాకారస్త్రీయం దాయోగుని వలన శిలాదివర్ణవిక్రేతయును కారాచారసమాఖ్యయందు నిషాదు

వలనఁ జర్మజీవియుం బొసంచిరి, విజ్ఞానసాగరులారా! సంగ్రహంబుగా మద్గురుశాసనంబున నగస్త్యునివలనవినిన జాతినిర్ణయంబు మీ కెఱింగించితి, స్వజాత్యుక్తకర్మం బీశ్వరార్పణంబుగా యథాశక్తిం జేసినపురుషుండు దానివలన ముక్తిగాంచు, ఇది వేదానుశాసనంబు, సకలజనంబులకు స్వజాతిధర్మవిహీనంబుగాఁ గర్మకోటులొనర్చిననైన ముక్తి లేదు ఇది వేదార్థనిశ్చయంబు, పశ్వాదులకుంబోలె భౌతికంబులగు స్థూలశరీరంబులకు జాతిభేదంబు లేదు; ఈదేహంబె నేనను నహంభావంబున నాత్మకు విప్రాదిజాతిభేదంబు లేర్పడియె; స్వస్వరూపజ్ఞానంబు లేమి దేహాభిమానంబు, బాయకుండుదురు, అట్టిజ్ఞానంబు వేదాంతనిశ్చితంబు, అదియు సద్గురూపదేశంబునఁ గలుగు, ఎవ్వాని కపరోక్షజ్ఞానంబు గల్గు వానికి విధినిషేధంబులు లేవు, ఇది వేదనిశ్చితంబు, వర్ణాశ్రమాచారపరులు వేదకింకరులగుదురు, స్త్రీపురుషులయం దెవ్వరికైన బ్రహ్మవిజ్ఞానం బపరోక్షంబుగాఁ గల్గు వారలకు వర్ణాశ్రమాచారధర్మం బెంతమాత్రంబునుం బనిలేదు, గురూక్తంబుగా నెఱుంగక సర్వవర్ణాశ్రమాచారధర్మంబులు వదలినవారు ఘోరనరకంబులం గూలుదురు. అట్లుగావున సర్వప్రయత్నంబుల సార్వకాలంబును సర్వవర్ణాశ్రమంబులవారు శ్రౌతస్మార్తకర్మంబులు శ్రద్ధాశక్తులై నడుపవలయు, అట్లైనఁ గ్రమంబుగా ముక్తిఁబడయుదురు" అని సూతుండూరకుండె నంత॥ 203

ఆ॥ జాతినిర్ణయంబు సకలోపకారంబు
శ్రుతులమతము, దీనిసూతువలన
విని మహర్షులంత విజ్ఞానసత్త్వాది
గుణసమృద్ధులగుచు గణుతిగనిరి॥ 204

—♦ తీర్థమాహాత్మ్యకథనము ♦—

తే॥ ప్రీతిదొడరంగ నమ్మునివ్రాతమునకు
"సర్వశాస్త్రార్థ"మిదియని సంగ్రహముగఁ

తీర్థమహాత్మ్యమెంతయుఁ దేటపడఁగఁ
జెప్పఁదొడఁగెనుసూతుండు శివుభజించి॥ 205

సీ॥ వినుఁడు గంగాద్వారమనుతీర్థమున మేష
సంక్రాంతి నశ్వని స్నాతుఁడగుచు
నుచితంబుగా శివయోగికిఁ దనశక్తి
ధనమిచ్చినను బాపతతులువాయు
రవి మేషగతుఁడైన భువిఁ బ్రయాగమునందుఁ
దగ బ్రహ్మశమనాగ్ని తారలందుఁ
గలకోద్దిధనమిచ్చి కాంచుముక్తిని వేగ
నార్ద్రిందుతారల నబ్ధి గంగ
గలయు చోటను మధ్యాహ్నకాలమునను
స్నాన మొనరించి దానముల్ సలిపెనేని
శివుని జెందును,బ్రహ్మవిష్ణ్వీశ సేవ్య
బ్రహ్మపదమిచ్చు నర్మద భక్తిఁగనిన॥ 206

క॥ యమునానది వైశాఖిని।గమలాప్తునివారమందుఁ గని యున్నదిలో
విమలమతిమునిఁగిసద్ధన।ముమహీసురుకొసఁగెనేనిపురహరుఁగాంచున్

తే॥ శారదావాసమగు సరస్వతిని భక్తి
స్నానమార్ద్రినునొనరించి శైవయోగిఁ
గనిధనంబిచ్చినను బితృజనముఁగూడి
స్వర్గలోకంబుఁజెందు,నిస్సంశయంబు॥ 208

తే॥ సింహమున రవిగురులువసించియుండఁ
దాన మొనరించి గోదావరీనదిఁ దగ
దానములుసేయ గంగను ద్వాదశాబ్ద
ములువసించినపుణ్యంబు పొందునతని॥

తే॥ సకలయోగీశ్వరారాధ్య సహ్యజాత
కృష్ణదరినున్న యయ్యింద్రకీలగిరిని

శివుఁడువసియించి విష్ణ్వాదిసేవ్యుఁడగుచు
స్నానమొనరించు పార్వతీసహితముగను॥ 210

తే॥ అందు నుపవాసమొనరించి యర్హరీతిఁ
బుణ్యతిథులందు దానముల్ భూమిదేవ
సమితికొసఁగి మహాదేవుఁ జంద్రమౌళిఁ
బూజచేసినఁ గల్గును భుక్తిముక్తి॥ 211

సీ॥ భుక్తిముక్తులొసంగ భూతేశుఁడీనదిఁ
గల్పించెఁ దత్తీరకలితభూమి
దక్షిణకైలాసతటమునగిరిశుండు
నిరతంబువసియించెఁ బరమకరుణ
నా సువర్ణముఖరవాసుఁడై శ్రీమాఘ
మాసంబున మఖర్క్షమాన్యతిథిని
స్నాతుఁడై శివయోగిజనులకుఁ గలకొద్ది
యర్థంబొసంగి యత్యాదరమునఁ
గాళహస్తీశు సర్వేశుఁ గాలకంఠుఁ
బూజచేసినవాఁడొందు భుక్తిముక్తి
తన్మహత్త్వంబువర్ణింపఁ దరముకాదు
నలువకైనను వేనోళ్ళచిలువకైన॥ 212

ఉ॥ కంపయనంగనొక్కనది కంజజనిర్మిత మందు భక్తిని
ష్కంపత బ్రహ్మవిష్ణువులు స్నానమొనర్చి నిరీహచిత్తులై
యింపుగసన్నుతించిరి మహేశ్వరునిం భగహస్తతారలన్
దెంపున నన్నదీస్థలి నుదీర్ణత దానమొసంగ ముక్తియా॥ 213

సీ॥ కపిలనా నొకనది గలదు భూస్థలి భద్ర
కాళి శ్రావణమాసకలితపూర్ణి
మాతిథిఁ దత్తటిజ్యోతిఃపట్టణమందుఁ
బరమేశునిలిపి సద్భక్తిఁ బూజ

గావించె నిచ్చోటఁ గలకొద్దిధనధాన్య
వస్త్రాదులిచ్చినవారికెల్ల
భుక్తిముక్తులుగల్గుఁ బుణ్యాస్పదంబైన
ముక్తానదీతీరమునను మున్ను
చాపగతిభానుఁడుండఁగా సర్వసురలు
స్నానమొనరించి శివుఁగొల్చినారు, మనుజు
లట్టికాలంబునందున నన్నవస్త్ర
ములను శివయోగిఁబూజింప ముక్తిగలుగు॥ 214

వ॥ మఱియు వృద్ధాచలంబున వృద్ధాచలేశ్వరుండైనశివుండు మణిముక్తానదిజలంబుల మధ్యాహ్నస్నానం బొనరించినవారికి ముక్తి నొసంగు, అద్దేవుసేవించిన సర్వసిద్ధియగు, శ్రీమద్వ్యాఘ్రపురంబున శివుం డంబికాసహితంబుగాఁ జిదాకారలింగంబై యుండి యందు, మాఘమాసంబున మఖానక్షత్రంబున లోకరక్షణార్థంబు విష్ణ్వాదులంగూడి శివగంగాజలంబుల స్నానంబు సేయుట నందు స్నానంబుచేసిన సర్వజనంబులకు బ్రహ్మలోకంబు ప్రాపించుఁ దానికిఁ బ్రాగుదీచీదిశయందు బ్రహ్మతీర్థంబు సముద్రతటంబునఁ గలదు, అది త్రిమూర్తిసేవితంబు వరుణుం డందు బ్రహ్మహత్యం బాసె, అతనికిఁ బ్రత్యక్షుండై శివుండు వరుణుంజూచి మాఘమాసంబున మఖానక్షత్రంబున నిందు స్నానదానంబులుచేసిన బ్రాహ్మణాంత్యజాదులకు సులభంబుగా ముక్తిగలుగునని వరంబిచ్చె, అందుఁ బర్వంబుల స్నానంబుచేసిన గతకల్మషుండై ముక్తుండగు, బ్రహ్మపురాఖ్యంబునకు మధ్యంబున బ్రహ్మతీర్థంబున రోమశుండు కల్పాదియందు బ్రహ్మాదులంగూడి సృష్ట్యర్థం బీశ్వరుఁ బూజించె. అర్కవారంబుల గ్రహణపర్వంబుల నందుస్నానంబు చేసి ధనం బొసంగిన నతం డీశ్వరుండగు, ఆ బ్రహ్మపురంబునకుఁ బశ్చిమంబున సూర్యపుష్కరిణీతీర్థంబునం దర్కవారంబుల గ్రహణాదిపర్వంబుల స్నానదానంబులొనర్చిన ముక్తుండగు నచ్చోట, మున్ను పూ

షుండు దక్షాధ్వరధ్వస్తంబులగు దంతంబులు పడసె, మున్నింద్రజిత్తు రథంబెక్కి లంకకరుగఁ దద్దక్షిణతటంబున రథంబునిలువంబడిన నచట శివునారాధింప నంభాసహితుం డీశ్వరుండు ప్రత్యక్షుండై యుండునిల్చి నం గొనిపోవ నుద్యుక్తుండైన నశక్యంబగుటయుఁ బ్రదక్షిణత్రయం బుగావించి రథంబెక్కి లంకకుంజనె. అందు,పర్వంబుల స్నానంబుసేసి బ్రాహ్మణులకు భోజనంబిడినఁ బాపనిర్ముక్తుండై శివలోకంబుఁజెందు, కావేర్యుదధిసంగమస్నానంబు సర్వపాపహారంబు, శ్వేతారణ్య కుంభకోణ మధ్యార్జున మంగళవంశ కామతీర్థ ద్యుతిస్థాన త్రికోటిక కావేర్యాదితీర్థంబుల నర్కవారంబులఁ బర్వంబుల స్నానంబు చేసి పరమేశ్వరునారాధింప ముక్తుండగు, ఈస్థానంబుల మృతుండైనఁ బాపకర్ముండును ముక్తిం గాంచు, ఈస్థానంబుల ననేకులు మృతిబొంది ముక్తులైరి, ఇవి సర్వకామంబులొసంగు, మఱియు వల్మీకతీర్థంబు త్రిమూర్తిసేవితంబును సూర్యాదిగ్రహమహర్షిసేవితంబును, అందు ఫాల్గుణమాసంబున వ్యతీపాత్తునందు స్నానంబు చేసి దానంబులొసంగినఁ గేవలముక్తి సంభవించు, క్షీరకుండంబునకుఁ బశ్చిమంబున దేవతాతీర్థంబుగలదు,అందు మున్ను దేవేంద్రుండు ప్రతిపర్వంబునందు స్నానంబుచేసి వత్సరాంతంబున వల్మీకేశ్వరునకుఁ బ్రణామత్రయంబొనర్చి ముక్తుండయ్యె. అందు ఫాల్గుణంబున నుత్తరయందు నర్కవారంబునఁ గృష్ణాష్టమి నార్ద్రి యందు స్నానంబు చేసిన మానవులు పరమగతిం బ్రాపింతురు, మఱియు బశ్చిమ సముద్రతీరంబున యోజనవిస్తీర్ణంబై సోమనాథంబను పుణ్యతీర్థంబువిలసిల్లు, అందుఁ బర్వంబుల నార్ద్రాష్టమీవ్యతీపాత్తుల నర్కవారంబునఁ జతుర్దశిని స్నానంబు చేసి యుపవసించి భస్మరుద్రాక్షభూషితుండై శివుంబూజించి శివయోగీంద్రుల నన్నపానాదులఁ దృప్తి నొందించువాతండు సంసారబంధనిర్ముక్తుండగు, మఱియును.

సీ॥ కలదు సేతువునందు గంధమాదనమునఁ
దీర్థరాజము మహాదివ్యపదము
శ్రీరామచంద్రుండు సీతాసమేతుఁడై
గరుడగంధర్వకిన్నరులు గొలువ
సుగ్రీవముఖకపుల్ సుముఖులై తనుఁగూడ
నచటఁ దానముచేసి యభవు నీశు
రామేశ్వరాభిఖ్యఁ గామసంహారు నిల్పి
దానంబులెన్నేని దనరఁ జేసి
పంక్తికంధరుఁ జంపిన బ్రహ్మహత్యఁ
బాసి శివపూజ గావించి భక్తియుక్తి
మరలఁ బురికేగి నిజరాజ్యభరము పూనె
సేతుమహాత్మ్య మేరికిఁ జెప్పవశము॥ 216

సీ॥ రామేశ్వరం బేగి రామేశు దర్శించి
యార్ద్రపర్వంబుల నర్కశుక్ర
వారంబులను వ్యతీపాతుల షడశీతి
ముఖపుణ్యవాసరంబులను భక్తి
స్నానంబుచేసి స్వశక్తిచే దానముల్
చేసి యా జగదీశు శివు మహేశు
లౌకికవైదికలక్షణస్తుతులచేఁ
బ్రణుతించి సప్రదక్షిణముగాఁగ
నందు మాసంబు నిల్చి మాసాంతదినము
నందు నుపవాసముండిన యనఘులకును
బంచవిధమహాపాపముల్ పాయు, నిజము
తరమె యమ్మహాస్థలిఁ జెప్ప ధాతకైన॥ 217

తే॥ వేదశాస్త్రాగమంబులు వెదకి వెదకి
తీర్థమహాత్మ్యమిదియని దేవదేవుఁ

డంబికకుఁదెల్పె నదియుఁ దా నంబ గుహున
కానఁదెల్పె గుహుండుదా ననిమెవిధికి॥ 218

క॥ విధియును మద్గురుమూర్తికి।బుధనుతులకుఁగరుణతోడ బోధించెనుస
త్కథదీని నాకు మద్గురుఁ। డధికుండై తెల్పె వేడ్క యమివరులారా!

ఉ॥ నేను కృపావిశేషమున నెమ్మదలిర్పఁగ మీకుఁజెప్పితిన్
మానకమీరు శిష్యులకు మన్ననతో నెఱిఁగింపుఁడింక నో
మౌనివరేణ్యులార!గరిమంబునదీనిఁ బఠించునెవ్వఁడా
మానిసముందుగాంచును సుమంగళమోక్షరమాధిపోన్నతిన్॥ 220

సీ॥ పుణ్యకాలములసీ పుణ్యచారిత్రంబుఁ
బఠియింప సర్వపాపములుఁబాయు
శివభక్తియుక్తిచేఁ దవిలితీర్థశ్రాద్ధ
ములయందువినిపింపఁ గలుగుధనము
దేవతాపూజల భావించివిననేని
బ్రహ్మవిష్ణ్వీశులు లా భవ్యమతికిఁ
బ్రత్యక్షమగుదురు,పద్మాక్షుడునుదీనిఁ
బఠియించు శివుకృపాబలముగోరి

మీరు శంభుప్రసాదంబుకోరి యింకఁ
బాఠ మొనరింపుఁ డీకథ భక్తితోడ"
ననుచుమునులకునూతుఁ డత్యంతకరుణ
బోధచేసె మహానందపూర్ణుఁడగుచు॥ 221

సీ॥ సోమార్ధశేఖరు సోముఁ బరాపరు
శంభు మహాదేవుఁ జంద్రమౌళి
సర్వజ్ఞు సర్వేశు సర్వకారణు శర్వు
సంసారరోగభేషజు మహేశు

దేవర్షి వందితదివ్యపాదాంబుజు
సర్వేశ్వరజ్ఞుని సకలగురుని
హృదయాబ్జముననిల్పి యెసంగ ధ్యానము చేసి
దండవద్వినతులు ధర నొనర్చి

వ్యాసు సంసారతారకు నాత్మగురుని
ధ్యానమొనరించి సూతుండు మౌనివరుల
విడిచి కైలాసగిరిని వివిక్తభూమి
నిర్వికల్పసమాధి నన్నియతిఁ బూనె॥ 222

క॥ సద్రాజవినుత!సంతత,భద్రా!కొలగానివంశభవకోటయ్యా
ఛ్ఛిద్రహృదంబుజనిలయా!,భద్రేభసమాఖ్యదైత్యపాటన!గిరిశా!॥

మాలిని॥ వటవిటపినివాసా!వర్ణిత శ్రీవిలాసా!
నిటలతలసునేత్రా!నిర్మలానందగాత్రా!
జటిపటలనిషేవ్యా!స్వాంతకంజాతభావ్యా!
నటదురునిజలీలా!నవ్యవిజ్ఞానశీలా!॥ 224

* గద్య *

కొప్పరా జనంతామాత్యపౌత్ర లింగనార్యపుత్ర సుజనవిధేయ
నరసింహనామధేయ ప్రణీతంబైన శ్రీస్కాందంబను
మహాపురాణంబునందు సూతసంహిత యందు
శివమాహాత్మ్యఖండంబు సర్వంబును
ప్రథమాశ్వాసము.

వ॥ ఇట్లమ్మధురాధరీతిలకం బయ్యుత్తమతపోనిధిసన్నిధి కేతెంచి
మహీధరంబుచందంబున నిశ్చంచలుండై యున్నఁ గనుంగొని కనుంగొ
నలనవ్వునివ్వటిల్ల నల్లనల్లనఁ జేరంజని, 306

సీ॥ గవిసెనసడలించి కమనీయవిస్ఫూర్తి
నిగనిగల్గలడాలు నెఱయఁదుడిచి
తనరుదక్షిణహస్తమున దండ మొనరించి
జిగిదేరుమేలిసోయగపుఁగాయ
లపరంజికుండలనపహసించెడిగుబ్బ
కవదాకఁ దంత్రులుకలయదీటి
యొనరుమెట్టులుచక్కనొత్తి రాగవ్యాప్తి
నొనరించి తాళలయోరుగతిని
మంద్రమధ్యమతారనిస్తంద్రరూఢి
వెలయ గీతప్రబంధముల్ చెలువుమీఱఁ
జేతనంబు లచేతనస్థితివహింప
వీణవాయించె లీలాప్రవీణయగుచు॥ 307

క॥ ఆనలినాక్షీతిలకము । గానంబత్యంతసౌఖ్యకరమై ఘనమై
వీనులవిందై వెస బ్ర । హ్మానందంబగుచునలరె నతులితఫణితిన్ ॥

క॥ మృగములుచొక్కు వహించెను
నగములుమిక్కిలిద్రవించె నానాగతులన్
ఖగములువిభ్రమమొందెన్
జగములహా! భూరిచిత్రసంస్థితిఁ దనరెన్ ॥ 309

తే॥ పొంకముగ సారదారువు లంకురించె
చిత్రవైఖరిఁ జిత్రముల్ జీవకళలు
దాల్చె నేమన వచ్చు నత్తలిరుబోణి
యతులగాంధర్వగీతవిద్యానిరూఢి ॥ 31

వ॥ ఇత్తెఱంగున నామెఱుంగుబోఁడి తనసంగీతప్రసంగంబుకొంత తడవు నెఱపి మనంబునంగరంగక చట్టుంబోలి యెప్పటియట్టు నిట్టట్టు కదలకయున్న యప్పుడమిఱేనిపట్టి దిట్టతనంబును మనంబునంబొగడి మగుడి విలాసవచనరచనాచమత్కారలాస్యకేళీనైపుణ్యంబు తేర్పఱించి వేసరి చిత్తంబుత్తలపడ నత్తలోదరి తనపొత్తుకత్తియలతో నిట్లనియె,

* రంభ శతకవచునితపస్సు భంగపఱుపలేకపోవుట *

క॥ “అండజయానా! యీముని। మండను నెమ్మనములీలమది నేచంగాఁ
జండతరస్థాణువో బలు। కొండయొకో కిట్టులుంట కుంభినిగలదే॥ 312

ఆ॥ కలికి! యడవిలోనఁగాసినవెన్నెల । పగిదియయ్యె నాదుపాటయెల్ల
సకియ! చెవిటివద్దశంఖంబుఁబట్టిన। మాడ్కియయ్యె నాదుమాటలెల్ల॥

సీ॥ జోరీఁగ మందారసుమగళన్మకరంద
మాధుర్యమెఱుఁగునే మధురవాణి!
పరిపక్వసహకారఫలరసమాధురి
శలభ మెఱుంగునే జలదవేణి!
రమణీయసంగీతరసపరిపాకంబు
రాసభమెఱుఁగునే రాజవదన!
పసిబాలుఁ డేర్పడఁ బర్వచంద్రుని కళా
సౌందర్యమెఱుఁగునే కుందరదన!
యిట్టిమూర్ఖుండు నన్నెట్టులెఱుఁగనేర్చు
నెన్నిపల్కినఁగాని యోసన్నుతాంగి!
తపు నెయిటువంటియెడలకుదివిజనాథుఁ
డనుప మముబోటివారల నలరుబోఁణి! 314

• రంభ యింద్రుని దూఱుట. •

సీ॥ జడదారిమవ్వంపుజవ్వనితోఁగూడి
శాపమొందిన దురాచారిగాఁడె
చేతులతీఁటవోఁ జిడిముడిపాటుతోఁ

గొండలనఱకిన కుమతిగాఁడె
పొలసుతిండులనెల్లఁ బోరిలోఁదయలేక
బలునిద్రఁపుచ్చిన చిలిపిగాఁడె
తనజము దాళికై తపసికన్నియ వేడి
ఘనతంత్రబాణముగొన్న కష్టిగాఁడె
పరఁగ గాధేయు నుగ్రతపంబు చెఱుపఁ
బంచి నను రాయిఁజేసిన భ్రష్టుగాఁడె
యిట్టిదుర్మార్గుఁడనుచు మున్నెఱిఁగి పనుప
నేలవచ్చితి నయ్యయో లోలనయన!" 315

వ॥ అనిపలికి 316

క॥ "ఆడుటొ రాలుగరంగఁగఁ। బాడుటొ చౌశీతిబంధఫణితిఁ రతులఁ
గూడుటొ యీతనితపమును। వేడుకఁ జెఱుచుటలుమనకువింతే చెలియా!

వ॥ కావున నెప్పటినెలవునకుంబోద"మనిపలికి యక్కలికి చెలు
వలుగొలువ మఱలిచనియెనంత 318

—శివుఁడు శతకవచునికిఁ బ్రత్యక్షమగుట—

సీ॥ కడలిఁబండినవాఁడు గాలితిండులఱేఁడు
సమ్ముగా సొమ్ముగా నలరువాఁడు
వేలుపువిడిమట్టు వెల్లనిబల్లట్టు
విల్లుగా నిల్లుగా వెలయువాఁడు
చలిమలదొరపట్టి సత్తిపట్టినజెట్టి
యాలుగాఁ జాలుగా నమరువాఁడు
జముతండ్రిజముకోడె చక్కని తెలికోడె
పూవుగా మావుగాఁ బొసఁగువాఁడు
మేలుగలవాఁడు జేజేలనేలువాఁడు
మించువాఁ డల్ల ఫీమలఁద్రుంచువాఁడు

మీఁఱువాఁడెల్లతపసులుగోరువాఁడు
దండివాఁడు విసంపుమేత్తిండివాఁడు॥ 319

క॥ గోపతిగోపతిగోభా। మాపతిగీష్పతిమునీంద్రమానసవినుత
శ్రీపాదాంబుజయుగళుఁడు। మాపతిప్రత్యక్షమయ్యె మానికిఁబ్రీతిన్॥

వ॥ ఇట్లు చేసికంటివేలుపు కట్టెదురంబాడకట్టిన రాచపట్టి పట్టం జాలని తోషంబున నవ్వృషధ్వజు మకరధ్వజసంహారు పాదపద్మంబులకు సాష్టాంగదండప్రణామంబులాచరించి లేచి ముకుళితకరకమలుండై యిట్లని స్తుతియించె. 321

సీ॥ భూషణీకృతసర్వభూభరణభుజంగ
జంగమస్థావరాంచత్ప్రపూర్ణ!
పూర్ణిమాచంద్రికోదీర్ణనిర్మలకాయ!
కాయజాఖర్వ దుర్గర్వహరణ!
రణకళావిభవ నిర్దళితగజాసుర!
సురలోకనిస్తులసుభగదక్ష!
దక్షకన్యాపయోధరమనస్సంచార!
చారణగేయ భాస్వత్ప్రతాప!
భావనిశ్చయముక్త విపక్షపక్ష!
పక్షిరాడ్ధ్వజ దివ్యప్రభావబాణ!
బాణగీర్వాణరిపుముఖభక్తవరద!
వరదయాకర! శివ! శర్వ! శరణుశరణు॥ 322

సీ॥ తీరైనకడియంబు తెల్లనిపాముగా
మీఁటినసామి! జోహారునీకు
అల్లిబిల్లగురాణి తెల్లనియేఱుగా
మీఁటినసామి! జోహారునీకు
మొల్లమోఁదనతావు తెల్లనిగట్టుగా
మీఁటినసామి! జోహారునీకు

తేజైనతలపువ్వు తెల్లనిగాముగా
మీఱినసామి! జోహారునీకు
తెల్ల తేజీవజీ రల్ల తెల్లతపసి
తెల్ల యేనుఁగు రాహుత్తు తెల్లదీవి
యిల్లుగలవేల్పు పొగడఁగ నుల్లసిల్లి
మీఱు తెల్లనిసామి! జోహారునీకు॥ 323

క॥ నల్లనివన్నియదుప్పటి। నల్లనిదోరవిడిదిదోనయు నల్లనియాలున్
నల్లనికుత్తుకగలిగిన। చల్లనివాతండ్రి! నీకుశరణుమహేశా! 324

వ॥ దేవా! నీవు జగదుద్భవస్థితిలయకారణుండవై రాజససాత్త్విక తామసగుణంబులగుఱియించి శతానందగోవిందరుద్రరూపంబుల వర్తింతువు, సర్వభూతాంతర్యామివి, సర్వేశ్వరుండవు, పురాణపురుషుండవు, కాలమూర్తివి, ఆదిమధ్యాంతరహితుండవు, అవ్యయుండవు, అక్షరుండవు, అగోచరుండవు, ఇట్లునీకునమస్కరించెద"నని పల్కి మఱియు॥ 325

సీ॥ "శ్రీకరద్యోధునీస్నిగ్ధజటాతతుల్
రమణీయచిత్రపత్రములుగాఁగ
రంగదుత్తుంగవిరాజితస్వర్ణదీ
భంగకణములు పుష్పములుగాఁగ
ఘనతరామృతమయూఖప్రాంచదుత్పల
బాంధవఖండంబుఫలముగాఁగఁ
బ్రాలేయభూమిభృద్భవలసద్దేహంబు
వెల్లితపల్లీమతల్లిగాఁగఁ
గలిగిమదభీష్టఫలములుగలుగఁజేయు
కల్పకం బీవయగుచు సాక్షాత్స్వరూప
మునను జనుదెంచినట్టులఁ గనఁగనయ్యె
శస్తగోపతిగోపతి! శరధిశరధి!" 326

వ॥ అనిపలికిన నంతకాంతకు డత్యంతసంతోషస్వాంతుండై తన యమందవచోమకరంద బిందుబృందంబుల నారాజసంక్రందననందను డెందంబునకు నత్యానందంబుఁ బొందుపఱచుచు నిట్లనియె, 327

క॥ "తపమునకు మెచ్చితిం గృప! నృపసుత! నీకేద్ది యైన నిచ్చెదఁ గానన్
నెపమిడక నీదు కోరిక । చెపు"మన నిట్లనియెఁ జంద్రశేఖరు తోడన్॥

వ॥ "దేవా! నిఖిలాభియాతిదుర్లంఘ్యవిరాజత్తేజోవిశేషంబును నఖర్వదుర్వారశాశ్వతైశ్వర్యంబును సురాసురాభేద్యమానానాస్త్ర శస్త్రవిద్యానవద్యనైపుణ్యంబును గామగమనంబుగా శతాంగంబునుని" మ్మనిపలికి మఱియును, 329

తే॥ "సరవిమాతంద్రి చంద్రశేఖరుఁడు పేరు
గలుఁగ జేసెను వెస శతకవచుఁడనుచు
రూఢి నయ్యర్థమున కనురూపముగను
గవచములునూఱొనర్పు నాగాత్రమందు॥ 330

వ॥ అవియును విపక్షదుర్నిరీక్ష్యంబులును నత్యంతగుంభితంబులును బరశస్త్రాభేద్యంబులునై యుండునట్లుగాఁ గరుణసేయు"మని ప్రార్థించిన నవ్వరంబిచ్చి చిచ్చరకంటిసామి తననెలవునకుంజనియె నంత, 331

తే॥ శతకవచుఁడటఁ బాసి విశ్రుతసమస్త
నిస్తులైశ్వర్యయుక్తుఁడై నిజపురంబు
కేగి యత్యంతవిభవమహేంద్రుఁడగుచు
నుండి దిగ్రాజనికరంబు గండణంచె॥ 332

వ॥ ఇట్లు దిగ్విజయంబు చేసి, 333

సీ॥ మందరసుందరకందరభూములఁ
గైలాసపర్వతకటకములను
మంజులహేమాద్రిమణిశిఖరంబులఁ
బృథులనందనచైత్రరథములందు

మలయాగనిలయోరుమలయజచ్ఛాయల
రాజితోద్యానాంతరంబులందుఁ
కాంచననవరత్నకలితహర్మ్యములందు
సలలితకృతకాద్రితలములందు
సారసోత్పలకల్హారషండహారి
భూరిశృంగారకాసారతీరములను
గామగమనశతాంగంబుకడఁక నెక్కి
ప్రేయసియుఁదాను విహరించుఁబ్రియమెలర్ప॥ 334
వ॥ ఇట్లు యథేచ్ఛావిహారంబుల దినంబులుపుచ్చుచుండెనంత.

—మణికంధరునికథ—

క॥ మణికంధరుఁడనుయక్షుఁడు। ఫణిరాడ్వైవేయునకునుబరమప్రియుఁడై
ధనదునిమిత్రుఁడు వైభవ। ఘనుడై మణినగరమందుఁగాపురముండున్॥
తే॥ అతనిపుత్రిక మహితాపరావతార
మోహినీదేవి త్రైలోక్యమోహనాంగి
తతనిరీక్షణమాలికాజితకురంగి
శ్రీహరికుమారు వజ్రాంగిమోహనాంగి॥ 337
ఉ॥ చక్కని మేల్మికుందనపుపసల్ సరిపాలుగఁదూచి నిద్దపుం
జుక్కలతేనిచాయలొలిగి సొంపుగనందులమేళవించి పెం
పెక్కెడుబ్రహ్మ యుంగులు పయిందిగఁబొఱఁగఁగమ్మిచేసెఁబో
యక్కనకాంగి నబ్జభవహాటకకారుఁడపూర్వవైఖరిన్॥ 338
తే॥ ఆత్మవిద్వేష విషమాంబకాఖ్యఁదనరెఁ
దలఁపఁదన్నామధేయంబు తనను జెందె
ననుచు నాఱవశరముగ మనసిజుండు
చేసికొనెఁబోలు నక్కన్యఁ జిత్రఫణితి॥ 339
సీ॥ ఇరులతో నీలంపుసరులతోఁ దుమ్మెద
గరులతో వెసఁబోరుఁ గురులతీరు

చెండ్లతో మారేడుపండ్లతో బంగారు
గిండ్లతోఁ దివురుఁ బాలిండ్లసొరు
చిలుకతోఁ గవురంపుఁబలుకుతో విరితేనె
కొలఁకుతో జగడించు బలుకుసంచు
పూలతో నలువగుత్రాలతోఁ గళ్కువ
జాలతో నిక్కు హాసంబు టెక్కు
ప్రావు మరుతూపునకుఁ దళ్కుచూపు చూపు
మీఱుఁ జీమలబారుఁ జెన్నారు నారు
ఠీవి యమృతంపుబావి చెంగావి మోవి
ముదితరూపంబు త్రైలోక్యమోహనంబు॥ 340

సర్వలఘుగీతము॥ అవుర!పలుకఁగనలవియె హరిణనయన
బెడఁగునునుజిగిబిగితొడ లొడలు నడలు
మనమునకుఁ దెలియవశమొ వనజవదన
ఘనవదనరదనపదనఖములసొబగు”॥ 341

వ॥ అనినవిని “తదనంతరకథావిధానం బెట్టిఁగింపు”మనుటయు,॥

క॥ సామీరిస్తుత!సద్గుణ భూమీ! భూమిముఖపంచభూతసదాంత
ర్యామీ! చామీకరభ(శ్రీ)మహిళాకామి! శేషశిఖరస్వామీ!343

సుగంధి॥ జారచోరవీరవార! సారచారువర్తనో
దార! తారహార! హీరతారకోరుకీర్తివి
స్తార!ఘోరభూరివైరి! వారుణాతిదారణా!
స్ఫారశూర!ధీరచిత్తసారసప్రచారణా॥ 344

గద్య॥ ఇది...అన్నమరాజాన్వయపయఃపారావార సంపూర్ణపూర్ణిమా
సుధాకర సకలగుణరత్నాకర విద్వజ్జనవిధేయ రమణ
యనామధేయ ప్రణీతంబైన శంతనురాజ
చరిత్రంబను మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

పూర్వయుగేషుహిగురుదారగమనగోవధ విధవోద్వాహాదయో మనుష్యాణాం
ధర్మాఏవ కలియుగేత్వమీఉత్తరామధర్మాఏవయథా తథైవాయమపి- నహీదానీంబ్రా
హ్మణ బీజాచ్ఛూద్రాది యోన్యాముద్భూతో బ్రాహ్మణఇతివ్యవహ్రియతే- వ్యవహారా
శ్రయో హిబ్రాహ్మణత్వాదిః పరమార్థతోద్వైతస్యైవాభావాత్ - తస్మాత్కలియుగే
బ్రాహ్మణేన విధివదూఢాయా ముత్పన్నఏవ బ్రాహ్మణః సఏవ షట్కర్మాచరణయో
గ్యఇతిసిద్ధం -ననుజన్మనాజాయతేశూద్రః కర్మణాజాయతేద్విజః వేదపాఠేనవిప్రస్స్యా
ద్బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణఇతిస్మరణాత్ బ్రాహ్మణేనబ్రాహ్మణ్యాం విధివదూఢాయా
ముత్పన్నోనబ్రాహ్మణః కింతు శూద్రఏవేతిచే న్నైవం - కింసర్వేమనుష్యాజన్మనా
శూద్రాజాయంతఇతితవవాదః ఉతకతిచిత్ - నాద్యః చండాలాదీనామపి శూద్రత్వా
పత్తేః - ద్వితీయేపి - కింశూద్రాయా ముత్పన్నాఏవశూద్రా యద్వాక్షత్రియస్త్రీ
దిషు - ఆద్యేబ్రాహ్మణ్యాంజాతస్యనశూద్రత్వం - ద్వితీయేతు వ్యవహారవిరోధాదిః-
నచైవంశూద్రాపుత్రశ్శూద్రఏవ బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణస్స్యాదితివాచ్యం-యదిశూద్రా
పుత్రః కర్మణాద్విజస్స్యా ద్వేదపాఠేనచ విప్రస్స్యాత్తర్హిజ్ఞానేన బ్రాహ్మణోపిస్యా
న్నతుతథా దృశ్యతే-కింతర్హి బ్రాహ్మణ్యా ముత్పన్నఏవ జన్మనా శూద్ర శ్శూద్రసమః
కర్మాభావాత్, కర్మణాతు సఏవద్విజః తస్యైవకర్మాధికారా గ్రహత్వాత్ - వేదపా
ఠేనచ సద్విజఏవవిప్రః, జ్ఞానేనతు సవిప్రఏవబ్రాహ్మణఇతికృత్వా బ్రహ్మజ్ఞానప్రయుక్తం
బ్రాహ్మణత్వమపి బ్రాహ్మణ్యా ముత్పన్నస్య బ్రాహ్మణస్యైవ నాన్యస్య ద్విజత్వవిప్ర
త్వవదితిబోద్ధవ్యం - ననుయదిజన్మనైవ బ్రాహ్మణ్యాం బ్రాహ్మణా దుత్పన్నోబ్రా
హ్మణస్తర్హి కథంతస్యపునః బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణత్వం పిష్టపేషణవద్విరోధాదితిచే
దుచ్యతే - పుంలింగో నపుంసకలింగశ్చేతి ద్వివిధస్తావ ద్బ్రహ్మశబ్దః - తత్రపుంలింగా
ద్బ్రహ్మ శబ్దాచ్చతుర్ముఖవాచకా జ్జాతౌవాచ్యాయాం బ్రాహ్మణశబ్దో నిష్పన్నః -
సచదర్శితః - క్లీబాద్బ్రహ్మశబ్దాత్పరబ్రహ్మవాచకాత్ జ్ఞానేవాచ్యేనిష్పన్నో బ్రాహ్మ
ణశబ్దోఽన్యః - నాత్రబ్రాహ్మోఽజాతావితిసూత్ర ప్రవృత్తిః పుంలింగబ్రహ్మశబ్దస్యైవ
తత్రగ్రహణాత్ - సచ తావాన్వే దేషుసర్వేషుబ్రాహ్మణస్యవిజానత ఇతిగీతాభాష్యే
శ్రీ శంకరాచార్యైర్దర్శితః బ్రాహ్మణస్సన్యాసీతి - విదుషఏవసన్యాసాధికారా త్సన్య
స్తస్యైవబ్రహ్మజ్ఞానిత్వాచ్చ బ్రాహ్మణోబ్రహ్మజ్ఞానీ సన్యాసీత్యర్థః - నచక్షత్రియా
దీనాం సన్యాసాద్బ్రహ్మజ్ఞానలాభే బ్రాహ్మణత్వం స్యాదితివాచ్యం బ్రాహ్మణోనిర్వే
దమాయాదిత్యాదిశ్రుతే ర్బ్రాహ్మణస్యైవసన్యాసాధికారాత్ తస్మాత్, జాత్యాయో
బ్రాహ్మణః సఏవకర్మాచరణాదినాద్విజత్వాదికంసంపాద్య జ్ఞానేనాపిబ్రాహ్మణోభ
వతి నత్వన్యఇతికృత్వానపిష్టపేషణవిరోధః - నాపిశూద్రాదీనాం జ్ఞానేనబ్రాహ్మణ
త్వాపాతః- వజ్రసూచ్యుపనిషత్తు క్రియావాచినంబ్రాహ్మణశబ్దంప్రగృహ్య బ్రాహ్మణ
త్వంనజాతిరిత్యుక్తవతి- నతుజాతివాచినం బ్రాహ్మణశబ్దం - తథాసతి శ్రుతిస్మృత్యా
దిబహువిరోధేన వజ్రసూచ్యుపనిషదోఽప్రామాణ్యప్రసంగాత్ - తథాహి వేదవిద్బ్రా

ఎల్లరకుఁ జెల్లవారీతి నేనుదాని
* తెలుఁగుఁ వ్రాసితి నితిహాసకలితముగను ॥ 234

హ్మణేవసంతి, బ్రాహ్మణోస్య ముఖమాసీత్ బ్రాహ్మణోనిర్వేదమాయా దిత్యాదిశ్రుతయః - గర్భాష్టమే బ్రాహ్మణముపనయీత, బ్రాహ్మణస్యధనం భైక్ష్యం, బ్రాహ్మణక్షత్రియవిశాం స్వభావప్రభవైర్గుణైః, ఇత్యాద్యాస్స్మృతయః పురాణాదీనిచే హానుసంధేయాని - వ్యవహారస్తు సార్వజనీనః ప్రత్యక్షఏవ బ్రాహ్మణోయం క్షత్రియోయం వైశ్యోయం శూద్రోయమిత్యాదిః - బ్రాహ్మణశబ్దో జాతివాచీహి సర్వలోకవిదితః క్షత్రియాదిశబ్దవత్ - జ్ఞానవాచీ బ్రాహ్మణశబ్దస్తువిద్వద్వ్యవహారమాత్రగోచరః నసార్వజనీనఇతి సర్వమవదాతం. ఇతి బెల్లంకొండ రామకవికృతిషు బ్రాహ్మణశబ్దవిచారః.

* 191[illegible] సం॥, జూన్, (అభినవసరస్వతి)

## బ్రాహ్మణత్వవిచారము.

లోకమున జాతినో క్రియనో గుణమునో సంజ్ఞనో ప్రవృత్తికినిమిత్తముఁజేసికొని ప్రతిపాద్యప్రతిపాదకతాసంబంధముతో శబ్దము లర్థములందువర్తించునని యున్నది. అర్థము ప్రతిపాద్యము శబ్దము ప్రతిపాదకము. ప్రతిపాద్యతాసంబంధముతో నర్థము శబ్దమందుండుననియుఁ బ్రతిపాదకతాసంబంధముతో శబ్ద మర్థమందుండుననియు శాస్త్రనియమము. గోవనుప్రవృత్తికి గోత్వజాతి నిమిత్తము. పాచకుఁడను ప్రవృత్తికిఁ బచనరూపక్రియనిమిత్తము. నీలఘటమనుప్రవృత్తికి నీలరూపగుణము నిమిత్తము-రాముఁడు కృష్ణుఁడనుప్రవృత్తికి రామకృష్ణరూపసంజ్ఞ నిమిత్తము. ఇట్లుండఁగా బ్రాహ్మణశబ్దము జాతివాచియా లేక క్రియావాచియా మఱిసంజ్ఞావాచియా గుణవాచియా యనుసంశ మిచటవిచార్యము.

ఐతే బ్రాహ్మణజాతి యిట్టిదని నిరూపింపవీలులేనందున బ్రాహ్మణశబ్దము జాతివాచికాదని కొందఱందురు. ఎందుచేతవీలులేదన్న వారిట్లుచర్చింతురు. ఎట్లనఁగా బ్రహ్మముఖమునఁబుట్టినవాఁడు బ్రాహ్మణుఁడా? లేక బ్రాహ్మణుఁడు విధ్యుక్తముగఁ బెండ్లాడినబ్రాహ్మణస్త్రీయందుఁబుట్టినవాఁడు బ్రాహ్మణుఁడా? యిఁక యజనాదిషట్కర్మలుగలవాఁడుబ్రాహ్మణుఁడా? బ్రహ్మజ్ఞాని బ్రాహ్మణుఁడా? ప్రకృతముబ్రాహ్మణులుగావ్యవహరింపఁబడెడివారలలోసాక్షాత్తు బ్రహ్మముఖమునుండిపుట్టినవాఁడొక్కండును లేమిని బ్రహ్మముఖమునఁబొడమినవాఁడు బ్రాహ్మణుఁడనుట యసంగతము. ఇఁక బ్రాహ్మణునకు వివాహితయగుస్వవర్ణస్త్రీయందుఁగలిగినవాఁడు బ్రాహ్మణుఁడనుటకుఁ బ్రథమునిబ్రాహ్మణత్వమును బ్రకృతునిబ్రాహ్మణత్వమును నొక్కటేయగుటచే నాత్మాశ్రయంబనుదోషమాపాదించుచున్నది. ఆత్మాశ్రయమనగా స్వజ్ఞానాధీనజ్ఞానవిషయత్వము. మఱియజనాదిషట్కర్మలుగలవాఁడుబ్రాహ్మణుఁడనియందమా షట్కర్మాచరణాధికార

ములేని యనుపనీతుఁడు బ్రాహ్మణుఁడుగా వ్యవహరింపఁబడక పోవలసివచ్చును. అనుపనీతుఁడు బ్రాహ్మణుఁడుగా వాడఁబడుట లోకానుభవమే కాక "గర్భాష్టమే బ్రాహ్మణముపనయీత" ఇత్యాదిస్మృతులయందును సుప్రసిద్ధము. ఇదియును గాక షట్కర్మాచరణమున బ్రాహ్మణత్వము వచ్చెడిచో షట్కర్మలనాచరించిన శూద్రాదులును బ్రాహ్మణశబ్దవాచ్యులగుదురు. ఇఁక బ్రహ్మజ్ఞాని బ్రాహ్మణుఁడనుటకు బ్రహ్మజ్ఞానులయిన జనకుఁడు మొదలగు క్షత్రియులుగూడ బ్రాహ్మణులే కావలసియుండెనుఁ గదా- కావున బ్రాహ్మణశబ్దము జాతివాచకమెంతయుం గానేరదు. "బ్రాహ్మోజాతౌ" అను వ్యాకరణసూత్రమునకు వైయర్థ్యము సంభవించును గావున బ్రహ్మజ్ఞానమును మానసిక క్రియగా నొప్పుకొన్నను బ్రాహ్మణశబ్దము బ్రహ్మజ్ఞానరూప క్రియావాచియుం గాఁజాలదు. జాతివాచకము గానపుడు బ్రాహ్మియని కావలసియుండుఁ గాని బ్రాహ్మణుఁడని కావీలులేదు. అట్లు బ్రహ్మజ్ఞానముగలవాఁడు బ్రాహ్మణుఁడయి బ్రాహ్మణశబ్దము క్రియావాచియైనచో బ్రహ్మజ్ఞానులగు జనకాదిక్షత్రియులయందును బ్రాహ్మణవ్యవహారప్రసంగ ముండెనుండెను. ఇఁక నిప్పటినుండి బ్రహ్మజ్ఞానులను బ్రాహ్మణులుగా వ్యవహరింతమనుట కనాదివ్యవహారమునే గ్రహింపవలెను గాని యన్యము కాదు. మఱియు బ్రాహ్మణత్వము శుక్లాదిగుణములనంతర్భూతమయినది కాకునికి గుణవాచికూడఁ గాదు. ఎవ్వరికిని బ్రాహ్మణుఁడని పేరుండనందున బ్రాహ్మణశబ్దము సంజ్ఞావాచియుం గాదని పెక్కండ్రు బుద్ధిమంతులు చేసెడి పూర్వపక్షములపయి బ్రాహ్మణశబ్దము జాతివాచియే కాని వేఱు కాదని నొక్కి వక్కాణించుచున్నారము. "బ్రాహ్మోజాతా" వను పాణినీయన్యాయమును "బ్రాహ్మణోऽస్యముఖమాసీ" త్తను శ్రుతియును నిందుకుఁ బ్రబలనిదానములు. ఈ "బ్రాహ్మణోऽస్యముఖమాసీ" త్తను శ్రుతియందును బ్రాహ్మణశబ్దము జాతివాచి కాదని చెప్పఁగూడదు. అట్లు జాతివాచి కానిచో వెంటనే "బాహూ రాజన్యః కృతః" "ఊరూ తదస్య యద్వైశ్యః-" అని క్షత్రియవైశ్యజాతుల యుత్పత్తి చెప్పఁబడదు. ఐతే బ్రాహ్మణజాతి యేదియనిన బ్రాహ్మణునకు వివాహితయగు స్వవర్ణస్త్రీకిఁ గలిగిన కుమారునిదే కాని యితరము కాదు. మొదటి బ్రాహ్మణుఁడును నీలాటివాఁడయి ప్రవాహరూపముచే ననాదిసిద్ధముగ వర్తిల్లుచున్నందున నాత్మాశ్రయరూపదోషముగూడ నాపాదింపదు. ఇందుమీఁదనే కొంద అవివేకిశిఖామణులు వ్యాసశుకశౌనకఋష్యశృంగాదిమహామునులబ్రాహ్మణులని వాపోవుచున్నారు. లోకాతిగప్రాభవులయి సర్వస్వాతంత్ర్యము వహించి యేదియో యొకనిమిత్తమున శరీరపరిగ్రహాదికం బొనరించి దేహాన్యాత్రవిదులగు వ్యాసాదుల యుగాంతరీయచరిత్రమును మనముదాహరణముఁ దెచ్చుకొనుటకంటె వేఱొండుమూర్ఖత్వముండఁబోదు. అట్లు కులమునకు వారిం బోల్చుకొనిన నన్నిటికిని బోల్చుకొనవలసియుండును. సద్యోగర్భమునఁ దపస్సిద్ధులైకాని మృగాదిమనుష్యేతరయోనులయందుఁ గాని యయోనులయందు గాఁని జనించినవార లీక్షాత్త్రబ్రాహ్మణికము సంపాదింపఁజూచువారలయందుండిన నావ్యాసాదులతో సరిపోల్చుకొనవచ్చును. వ్యాసులు క్షత్రియుఁడగు నుపరిచర

వసు మహారాజువీర్యముచే మత్స్యగర్భమున జనియించి యోజనగంధినాఁబడి దాశరాజుచేఁ బెంపఁబడుచు నావగడపెడి సత్యవతి సద్యోగర్భమున వేదవిభాగపురస్సరంబుగ జగదుద్ధారంబొనరింప నవతరించిన శ్రీమహావిష్ణువుకాని వేఱుకాదు. ఓషవంక లెన్నియైనది తెలియని తిష్ఠసూత్రులందఱును వ్యాసులయుత్పత్తి హేయమన్నట్లు ప్రలపించుచుందురు. ఎన్నిసంవత్సరములో మైథునముఁజేయఁజేయ యోనినిఁబడి నవమాసములపర్యంతము గర్భనరకమనుభవించి భూమికివచ్చి బహువత్సరములకు రెండుమూఁడు తోట్రుమొట్రుమాఁటలు నేర్చుకొనినవైధవేయులు గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిన రీతి వ్యాసులపై నాడిపోసికొనిన నామహానుభావుని యనూనప్రభావమున కేమిలోటుగలుగును. స్నానసమయమునఁగలిగిన యేకస్మాన్మోహమునస్ఖలితమై సరఃపతితమగు విభాండకమునివీర్యముం బానము సేసినలేడికి లేడిపిల్లయేపుట్టక ఋష్యశృంగుఁడేలపుట్టవలె. మిత్రావరుణులు గంధర్వమిథునదర్శనముచేఁ స్ఖలితమైన స్వవీర్యమును గలశమునునుంచిన మాత్రమున నందు మహాతపశ్శాలులగు వసిష్ఠాగస్త్యులు జనింపవలెనా? స్వతంత్రులుగానిచో వీరియుత్పత్తులీరీతివిచిత్రకరములై యుండవు. ఏవిషయమునఁగూడవీరిందులదూఁగని సామాన్యులువీరిజన్మలిట్టివిగుటసంకరులనియుఁబ్రకృతము గౌరవభాజనులగు బ్రాహ్మణులేతద్గోత్రజులగుటవారుగూడనట్టిరేయనియు వాపోయినఁబోవనిందు! వీరిజననాదులిట్టియాశ్చర్యకరములైనవియగుటచే వీరుమహాత్ములైతేఁ నగుదురుగాక, బ్రాహ్మణులుమాత్రముకానేరరని కొందఱభిప్రాయపడుదురేమొ- బ్రహ్మబీజసంభూతులును బ్రాహ్మణునిచేవిధివత్తుగానుపనయనాదివిధులచే సంస్కరింపఁబడినవారలును నీశ్వరానుగ్రహము సంపూర్ణముగాఁబడసినవారలునగుటవలనవారుబ్రాహ్మణులగుటకించుకంతయు సంశయముండదు ప్రకృతము బ్రాహ్మణత్వమునకాసించెడిబ్రాహ్మణేతరులొకవేళ మేమును బ్రాహ్మణబీజప్రభవులమేయనియనుకొన్నను చౌర్యముననుదయించియుందురుగాని ప్రత్యక్షముగానుఁయుంచుటకు నన్యవర్ణస్త్రీవివాహములేని యీకలికాలమున సంభవింపదు. అట్టివిపులటాపుత్రులకు బ్రాహ్మణులుబహిరంగముగా నుపనయనాదిసంస్కారములఁ జేయఁజాలరనుటకునిస్సంశయము. ఇట్టిబ్రాహ్మణేతరులకు వేదములందుఁ జెప్పఁబడియున్నదని యాజనాదికర్మలఁజేయింపఁజూచుట యయ్యవారినిజేయఁబోయినఁ గోఁతియైనచందముకాని వేఱుకాదు. వర్ణచతుష్టయమునకుఁగూడ యాజనాధికారమున్నదని వేదములే చెప్పినచోఁ దద్విభజనకర్తయగు వ్యాసులతండ్రి పరాశరులు శ్లో॥ కపిలాక్షీరపానేన బ్రాహ్మణీసంగమేనచ। వేదాక్షరవిచారేణ శూద్రశ్చండాలతాంవ్రజేత్, అని యేలచెప్పియుండును. శ్లో॥ కృతేతుమానవాధర్మా స్త్రేతాయాం గౌతమాస్స్మృతాః। ద్వాపరే శంఖలిఖితాః కలౌపారాశరాస్స్మృతాః, అని యున్నందునఁ గలియుగంబునకుఁ బరాశరస్మృతి ముఖ్యప్రమాణమైయున్నది. శ్లో॥ ధర్మంజిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమం శ్రుతిః। ద్వితీయం ధర్మశాస్త్రంచ తృతీయం లోకసంగ్రహః॥ అను భారతవచనానుసరణిని ధర్మశాస్త్రములు ద్వితీయప్రమాణములై యున్నవి. ఈ భారతాదులలోఁ దమకనుకూలము

లగు స్థలములు ప్రమాణములుగా గ్రహించినపుడు సర్వమున్ గ్రహింపవలసియేయుండును గావున నందుకు బద్ధులమయియే యుండవలయునుగదా. గాని గాంతిరీయపు రుపనిష్ఠమగు బ్రాహ్మణత్వమే కలియుగమందుఁగూడ నాశ్రయింపఁదగు ననుటకు నప్పటి ధర్మములకును నిప్పటిధర్మములకును జాలభేదముగనుపట్టెడు, పూర్వయుగముల గురుదారగమన గోవధవిధవోద్వాహాదులు ధర్మములై యున్నవి. కలియుగమందవి సుతరామధర్మములు ప్రకృతము బ్రాహ్మణబీజముచే శూద్రాదియోనులయందుఁబుట్టినవాఁడెవఁడును బ్రాహ్మణుఁడుగా వ్యవహరింపఁబడుటలేదు. బ్రాహ్మణ క్షత్రియాదిజాతులు వ్యవహారాశ్రయములుగదా. పరమార్థముతోఁజూచిన ద్వైతమే యవసరములేక యిప్పటి మననవనాగరికుల యభిప్రాయముచొప్పున నగ్రజులు నంత్యజులు నేకమయియేయుండనగునుగావునఁ గలియుగమున బ్రాహ్మణునకు వివాహితస్త్రీయందుఁ గలిగినవాఁడే బ్రాహ్మణుడు. వాఁడే షట్కర్మాచరణ యోగ్యుఁడనుట సిద్ధము. శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః। వేదపాఠేన విప్రస్స్యా ద్బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః॥ అనుస్మరణమున బ్రాహ్మణునకు వివాహితయగు బ్రాహ్మణియం దుదయించినవాఁడు శూద్రుఁడు కాని బ్రాహ్మణుఁడుకాడని కొందఱుబుద్ధిమంతులుచ్చరింతురు. ఐతే వారివాదము సమస్తమనుజులును జన్మచే శూద్రులనియో లేక కొందఱనియో? సమస్తమనుజులును జన్మచే శూద్రులనినఁ జండాలులుగూడ శూద్రులుకావలసివచ్చును. లేక కొందఱే శూద్రులనియనినచో వారిలో శూద్రస్త్రీకిజన్మించినవారే శూద్రులా? లేక క్షత్రియాదిస్త్రీలయందుఁగలిగినవారుకూడనా? శూద్రస్త్రీకిజన్మించినవారుమట్టుకే శూద్రులైన బ్రాహ్మణస్త్రీకిజన్మించినవారు కానేకారు. లేక క్షత్రియాదిస్త్రీలకుఁగలిగినవారుశూద్రులన్నఁ బ్రకృతవ్యవహారమునకు విరోధమువాటిల్లును. శూద్రాపుత్రుఁడు ప్రథమముశూద్రుఁడేయై బ్రహ్మజ్ఞానసంపాదనానంతరము బ్రాహ్మణుఁడగునని యనఁజెల్లదు. శూద్రాపుత్రుఁడు కర్మచే ద్విజుఁడై వేదపాఠముచే విప్రుఁడయ్యెడిచో బ్రహ్మజ్ఞానముచే బ్రాహ్మణుఁడుగూడ నగును గాని యట్లెక్కడను గనఁబడుటలేదు. ఇఁక బ్రాహ్మణస్త్రీకుదయించినవాఁడే కర్మశూన్యుఁడగుటవలన జన్మచే శూద్రుఁడు అనఁగా శూద్రసముండును నాశూద్రసముఁడే కర్మాధికారముగలిగినపుడు ద్విజుండును నట్టిద్విజుఁడే వేదపాఠానంతరము విప్రుండును నావిప్రుఁడే జ్ఞానానంతరము బ్రాహ్మణుండును నని బ్రహ్మజ్ఞానప్రయుక్తమగు బ్రాహ్మణత్వముగూడ ద్విజత్వవిప్రత్వములవలె బ్రాహ్మణికిజనించిన బ్రాహ్మణునకేకాని యన్యునకుఁగాదని యెఱుఁగునది. బ్రాహ్మణస్త్రీకి బ్రాహ్మణునివలనఁగలిగినవాఁడే బ్రాహ్మణుఁడగుచుండఁగా మరలనతనికి బ్రహ్మజ్ఞానముచే బ్రాహ్మణత్వము పిష్టపేషణమువలె విరుద్ధమైయున్నదనికూడ నాక్షేపింపవలసినయంశమే. అందుకు బ్రహ్మశబ్దము పుంలింగమనియు నపుంసకలింగమనియు ద్వివిధమైయున్నయది. అందొక బ్రాహ్మణశబ్దము జాతివివక్షకై చతుర్ముఖవాచకమగు పుంలింగబ్రహ్మశబ్దమువలన నిష్పన్నమైనది. రెండవది జ్ఞానవివక్షకై పరబ్రహ్మవాచకమగు నపుంసకలింగబ్రహ్మశ

బ్దమువలననిష్పన్న మైనది, బ్రాహ్మజాతావనుసూత్రముయొక్క ప్రవృత్తి పుంలింగబ్రహ్మశబ్దమునకే గ్రహించినందున నీనపుంసకలింగబ్రహ్మశబ్దమునం దనవసరము. అదియును శ్లో॥ తావాన్ వేదేషుసర్వేషుబ్రాహ్మణస్యవిజానతః, అని గీతాభాష్యమున శ్రీశంకరాచార్యులు బ్రాహ్మణుఁడనఁగా సన్యాసియనిప్రదర్శించిరి. విద్వాంసునకే సన్యాసాధికారమున్నందునను సన్యసించినవాఁడే బ్రహ్మజ్ఞానియగుటవలనను బ్రాహ్మణుఁడనఁగా బ్రహ్మజ్ఞానియనియు బ్రహ్మజ్ఞానియనఁగా సన్యాసియనియు సగ్రథముంజెప్పనగు. బ్రాహ్మణోనిర్వేదమాయాతను శ్రుతియందు బ్రాహ్మణునకే సన్యాసాధికారమున్నందున క్షత్రియాదులు సన్యసించి బ్రహ్మజ్ఞానులై బ్రాహ్మణత్వముం బడయ వీలులేదుకావున జాతిచేనెవఁడుబ్రాహ్మణుఁడో వాఁడే కర్మాచరణాదికముచే ద్విజత్వాదికముల్ సంపాదించి జ్ఞానముచేఁగూడ బ్రాహ్మణుఁడగుచున్నాడుకాని యన్యుఁడుకాడని పిష్టపేషణవిరోధము పరిహరణీయము. శూద్రాదులకుఁగూడ జ్ఞానముచేబ్రాహ్మణత్వలాభముకానేరదు. వజ్రసూచ్యుపనిషత్తుక్రియావాచియగుబ్రాహ్మణశబ్దముం గ్రహించిబ్రాహ్మణత్వము జాతికాదని చెప్పినదికాని జాతివాచకముగు బ్రాహ్మణశబ్దముంగ్రహించికాదు. అట్లయినచో శ్రుతిస్మృత్యాదిబహువిరోధముచే వజ్రసూచ్యుపనిషత్తునకప్రామాణ్యప్రసంగమువచ్చును. వేదవిదిబ్రాహ్మణేవసంతి బ్రాహ్మణోస్యముఖమాసీత్. బ్రాహ్మణో నిర్వేదమాయాత్. ఇత్యాదిశ్రుతులును గర్భాష్టమేబ్రాహ్మణముపనయీత-బ్రాహ్మణస్యధనం భైక్ష్యం బ్రాహ్మణక్షత్రియ విశాంస్వభావప్రభవైర్గుణైః-ఇత్యాది స్మృతులును పురాణములును నిక్కడ ననుసంధేయములు బ్రాహ్మణుఁడనియు క్షత్రియుఁడనియు వైశ్యుఁడనియు శూద్రుఁడనియు నిత్యాదిసర్వజనవ్యవహారము ప్రత్యక్షమే-క్షత్రియాదిశబ్దములవలె జాతివాచియగు బ్రాహ్మణశబ్దము సర్వలోకవిదితము. జ్ఞానవాచియగుబ్రాహ్మణశబ్దము విద్వద్వ్యవహారమాత్రగోచరము గాని సార్వజనీనము కాదని సర్వముల్ సమంజసము.

ఈబ్రాహ్మణత్వవిషయమైనయొ భారతీయమగు గాథయొక్క డిక్కడ వక్కాణింతుము.

## భారతము-అనుశాసనికపర్వము.

——:o:——

కం॥ అనినఁ బితామహుఁగోనన। జనపతి బ్రాహ్మణ్యమునకుజాతులమాటల్। జనియించినవానికిదొరఁ। కొనునో కో యతివిమలకర్మగుణయోగములన్॥ వ॥ అనియడిగిననతం డతనికిట్లనియె॥ తే॥ బ్రాహ్మణత్వంబు కడుదుర్లభం బనేక।జన్మములఁబొంది తిరుగంగసంభవించునపుడుగనునది, యున్నతమైనయుపప్ర।దంబు, విను మెఱిఁగించెద దానితెఱఁగు॥వ॥ అది ఇంద్రమతంగసంవాదంబను నితిహాసంబొకర్ణించిననెఱుంగనగుం గావున నక్కథయుపన్యసించెద. నొక్కవిప్రునికొడుకు మతంగుండనువాఁడు యజ్ఞార్థంబైన పనికిఁ దండ్రిపనుపునం బోయిపోయి. క॥ పుదమునఁబెలుచన నొక గా।డిదకొదమం గోల

గొనియడిచె నడిచిన నొవ్వొదవి తనతల్లి జేరఁగ। నదిచని నన్నీతఁ డడిచెనని చెప్పటయుఁ
వ॥ ఆ గార్ధభి తనకొడుకుతో వీఁడు చండాలుండు ప్రచండస్వభావుండు గాకుండునే యనినఁ
బూర్వజన్మకర్మవిశేషంబునఁ దిర్యగ్జాతిభాషావిదుండగుట నవ్విప్రపుత్రుం డప్పలుకులు
విని యిది దూషణంబు గాదు, నిరూపణాలాపంబై యున్నది. యటు గావున మాలతనంబు
గలుగ నేర్చునని నిశ్చయించి యగ్గాడిదకడకుం బోయి క॥ తనకుం జండాలత। వచ్చినకార
ణముడిగి దానిచేతం గం దర్పునిచెద్ది మంగలికిని నిజ।జననికిఁ బొందగుటవిని విషాదము
తోడన్॥ వ॥ తనపోయెడు పనికిఁ బోక సురలి సదనంబునకుం జని జనకునికత్తెఱంగెల్ల
నెఱింగించి యతనితో శూద్రబీజంబున బ్రాహ్మణియందు జన్మించినవాఁడు చండాలుం
డగుటకు సందియం బేమి గార్ధభి శాపజాతగానోపు నది యున్నరూపపలికె, బ్రాహ్మ
ణ్యంబు తపంబున సంపాదించెదం గాక యని పల్కి వీడ్కొని వనంబునకుం బోయి క॥ పర
మతపమాచరింపఁగ। సురపతి వొడచూపి యడుగు సువ్రత నీకున్। వరమిచ్చెదననిన
ధరా। మరత్వమిమ్మనియె నతఁడు మదిముద మొదవన్ చ॥ అనవుడు బ్రాహ్మణత్వము
మహత్త్వమెఱుంగవె యన్యజాతికందునె యది, యొండు వేఁడు మదిఁ దోఁచిన మేలనియెన్
బలారి, వాఁడనితరసాధ్యమైనతపస్స్థలితంబుగఁ జేయుచుండెదన్, జనుముమహాత్మ నీవ
నిన నస్మితుఁడై యతఁడగె నేగినన్॥ వ॥ మతంగుం డేకపాదంబున నూఱేండ్లుతపంబు
చేసిన నింద్రుండు క్రమ్మరవచ్చి తే॥ ఏనువలదని చెప్పినమాన వెట్లు। పరమ దుర్లభపదమా
సపడికరంబు మేలితపమాచరింతె చండాలుఁడిట్టి। దానసలియించు నిదినీకుఁదగదువి
డువు వ॥ వినుమిత్తెఱంగు తపంబునకుఁ బదిముడుంగులుఁ జేసి చండాలుండు శూద్రుండగు
నూఱుముడుంగులు చేసి శూద్రుండు వైశ్యుఁడగు, వేయిముడుంగులాచరించి వైశ్యుండు క్షత్రి
యుండగు నప్పణ్యాచరంబునకుఁ బది వేలుముడుంగులు నిర్వర్తించి క్షత్రియుండు దు
ర్బ్రాహ్మణుండగు నానియమంబునకు లక్షముడుంగులు సల్పి శమదమసత్యాహింసల
సమాత్సర్యంబున నార్యబ్రాహ్మణహృదయంబులు సదయంబులుగావించి దుర్బ్రాహ్మ
ణుండు సద్బ్రాహ్మణుండగు నిట్లు బ్రాహ్మణ్యం బలఁతులం బడయవచ్చునే? పడసియు
నది చెడకుండ నడుపశక్యంబగునే, యనేకజన్మంబుల నొకప్పుడు బ్రాహ్మణజన్మంబు
నొందియుఁ గొందఱు ధనవాంఛావిషయలౌల్యాదులం దదాచారంబు దిగ విడిచి చెడుదు
రిట్టిమహాపదంబు గోరి నిన్ను నీవయేల వినాశంబు నొందించుకొనియెదవు, నీతపోనిష్ఠ చాలించి
తగు నదియొక్క వరంబు వేడుమనియె ననినఁ డూరకున్న నాఖండలుండరిగె వెండియు
క॥ అంగుష్ఠమొకటి మోపి మ। తంగుడు నూఱేండ్లు చేసెఁ దపము నియతిమై। నంగములో
నస్థులతో। సంగతముగఁ గోఁప వెక్కసముగా నరముల్॥ ఆ॥ ఇట్లు చేసి శక్తి యెల్లనుగడ
చన్న। నతఁడు నేలవ్రాలె నతిరయమున వచ్చియమరుఁ బట్టి వాసవుఁడకట। నీవు జెప్ప
నయ్యు నెమ్మనేన॥ వ॥ క్షత్రియాదులచేతం బట్టువడని బ్రాహ్మణ్యంబసాధ్యంబు, బ్రా
హ్మణ్యంబను శార్దూలంబుతోడి మేలంబు దక్కుము, నీకు నొక్కవరంబిచ్చెదఁ గైకొ
నుమని పల్కుటయు నతం డొడఁబడినఁ బరమానందంబున ఆ॥ చందదేవుఁడనఁ బ్రశస్తి

వహించి సు। స్త్రీలుపూజనంబు సేయఁ గామరూపధారియై నిరూపింపవిహంగభా। వంబు గల్గి పరిమదవర్తిపగుము॥ క॥ అనివరమిచ్చిన హేరంబుఁడు। చనియెననినవిని యజాతశత్రుఁడు గాంగేయునితో బ్రాహ్మణ్యము నెఱ। జనములకుం బొందఁగా నశక్యం బనెన్॥

---

క॥ చిత్తూర్జిల్లాతీర్పను, బౌత్త్రమునంగలిగినట్టి బూతుల్ ప్రాఁతల్
దత్తోత్తరములు కాఁబడె, నుత్తాతాళికపుఁ గ్రోధమహాత్మ్యమునన్

చ॥ ప్రకటనచేసిపీరిటు ప్రపవమంబునఁగల్గినట్టి మా
మకరుష కొంత శాంతిచేన మానముదాలిచి పారకాళి కు
త్సుక మొనరించు గ్రంథముల కోడనె పేపరునప్పుచుంచుదున్
గకవిక లేమిలేక యొకట్టై పడినేగెను మూడువత్సరాల్॥ 236

* గద్య *

ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్ష సంప్రాప్త కవితాసాహిత్య
నిధాన హారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబి
కా తనూభవ గర్భశుక్తిముక్తాయమాన విద్వత్సభా
విఖ్యాతావధానవిధాన జానపాటి పట్టాభి
రామాభిధాన విలిఖితంబగు
స్వర్ణకారవ్యవహారంబు నందుఁ
బ్రథమభాగము.

# ప్రధాన పోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు.
2 శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహాదరు
కుమార జమీందారుగారు గంపలగూడెం

## పోషకులు.

1 శ్రీ రాజా నారయప్పారావు సింహాద్ర్యప్పారావు బహాదరు
జమీందారులు, నూజివీడు.
2 అల్లాడి లక్ష్మ[illegible]రావుగారు కరణము జంగిపల్లి
3 రామసింగుగారు నెల్లుట్ల షాపురపు సంస్థానము మానేజరు నెల్లుట్ల
4 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు
5 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మక్తాదారు చౌల్లేరు
6 బీకకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

## సహాయులు.

1 అన్నమురాజు సుబ్బారావుగారు నందూరు.
2 నందూరు నరసింహారావుగారు, కరణం, నందూరు.
3 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి.
4 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి
5 బాకరాజు దేశముఖుగారు, యాడవరము.
6 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు.
7 హేజీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిల్ల.
8 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద.
9 పిరాట్ల సీతాకాంతముగారు, చింతపల్లి.
10 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.
11 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
12 వెలుగూరి పిచ్చయ్యగారు, కొదమగుండ్ల.
13 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.
14 గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్కాట్బ్రదర్సు, కంపెని.
15 దెందుకూరి బ్రహ్మాండదీక్షితులుగారు గుంటూరు.
16 టెకుమళ్ల గోపాలరావుగారు, కరణం, అమీదీపురం.

అభినవసరస్వతీ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు—

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | అళ్ళయాచార్యవిజయము ... ... | | రు. 0 | 4 | 0 |
| 2 | కరిణీకోద్ధారిణి ... ... | | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయము | } ఇవి నాటకములు. | 0 | 4 | 0 |
| 4 | కంసవధము | | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి ... ... | | 0 | 4 | 0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర .. ... | | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | | 0 | 2 | 0 |
| 8 | వత్సల నీతిశతకము ... ... | | 0 | 1 | 6 |
| 9 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము ... ... | | 0 | 2 | 0 |
| 10 | అత్యద్భుతవిమర్శనము ... ... | | 0 | 5 | 0 |
| 11 | నర్సరావుపేట శతావధానము (తిరుపతి వేంకటీయము) | | 0 | 3 | [illegible] |
| 12 | లక్ష్మీవిలాసము ... ... | | 0 | 4 | 0 |
| 13 | చిత్తూరుజిల్లా తీర్పువిమర్శనము ... | | 0 | 4 | 0 |
| 14 | పశ్యాంపశ్యాం ... ... | | 0 | 2 | 0 |
| 15 | సంగదోషము ... ... | | 0 | 3 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము ... ... | | 0 | 3 | 0 |
| 17 | వీరభాగవతము ... ... | | 1 | 4 | 0 |
| 18 | పుళిందావివాహము ... ... | | 0 | 4 | 0 |
| 19 | గురిగింజ ... ... | | 0 | 1 | 0 |
| 20 | గుంటూరుసీమ, తిరుపతి వేంకటీయము ... | | 1 | 0 | |
| 21 | వేమవరాగ్రహారశతావధానము ... | | 0 | 12 | |
| 22 | పిష్టపేషణము ... ... | | 0 | 1 | |
| 23 | వ్యాసనిష్కాసనము ... ... | | 0 | 1 | |